# ఆంధ్రనామసంగ్రహము.

# ఆంధ్రనామశేషము.

# సాంబనిఘంటువు.

సటీకము.



శ్రీ ర స్తు.

# ఆంధ్ర నిఘంటు త్రయము

సటీకము.

అకారాదిశబ్దానుక్రమణికా సహితము.

ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామ శేషము,

సాంబనిఘంటువు.


కావ్యవ్యాకరణ తీర్థులు,

పంచాగ్నుల - ఆదినారాయణశాస్త్రిగారిచే

పరిష్కృతము.



మద్రాస్.

ఆనందముద్రణాలయమున ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కో వారిచే

ప్రకటితము.

1924



Copy Right.]

# ప్రస్తావన.



భాషావ్యుత్పత్తికి మిక్కిలి యావశ్యకములగు నిఘంటువులు తెనుఁగునకుఁ బెక్కులు గానంబడుచున్నవి. అందుఁ గొన్ని యకారాదిక్రమమునను దక్కినవి వర్గాదిరూపమునను విరచింపఁబడియున్నవి. మొదటివానియందుఁ దలఁచినశబ్దమును దోడనే చూచుకొనునట్టియానుకూల్యము చాలఁ గలదు. కాని రెండవవానియందు నొక్కొక్కవిషయముతోడ దానిని సంబంధించినవియెల్లను నొక్కటిగా వర్గరూపమునఁ గూర్పఁబడి యుండుటయేకాక ప్రతిశబ్దము నించుమించుగాఁ బర్యాయములతో నెల్లఁ గూడియుండుటయుఁ గలదు. కాన నిట్టివాని వలన భాషాపరిజ్ఞానము మిక్కిలి సులభముగాను బూర్ణముగాను మఱింతత్వరితముగాను సమకూఱుచున్నది. ఇంతియకాక యిట్టి నిఘంటువులెల్ల బహుతరముగాఁ బరిమితములును బద్యాత్మకంబులునై, ధారణకు మిక్కిలి యనుకూలంబులుగా నుండుటవలనఁ గంఠపాఠముగా వల్లింపఁబడునవె, యిట్లు వల్లించువారికిఁ గోరినపుడెల్లఁ బుస్తకసాహాయ్య మక్కఱలేక కొంగుముడివలె నుపయోగించుచుండును. ఇందుఁగల యాంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు ననెడి యీమూఁడునిఘంటువులు నిట్టివే. ఇదియ వీనిని సటీకముగా ముద్రించుటకు ముఖ్యమగు కారణము.

ఆంధ్రనామసంగ్రహము రచించినకవి పైడిపాటిలక్ష్మణ కవి. ఇతఁడు ఏకామ్రమంత్రి పుత్రుండు. కౌండిన్యగోత్రుఁడు. ఈగ్రంథమును గాళీవిశ్వనాథునికంకితముచేయుటం బట్టి శైవుఁడని తెలియుచున్నది. ఇతఁడేకాలమువాఁడో నూటిగాఁజెప్పుట కాధారములేదు. ఆంధ్రనామ శేషమును రచించిన అడిదము సూరనకవి ఇతనిని పేరుకొనియున్నాఁడు. అతఁడు క్రీ, శ.1750 సం-1780, లలో నుండినట్లు కవిచరిత్రలవలనఁ దెలియుటఁబట్టి లక్ష్మణకవి యంతకుఁ బూర్వమం దుండినవాఁడని యేర్పడుచున్నది. ఇది దేవవర్గు, మానవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు నానార్థవర్గు అని యైదుభాగములుగా విభక్తము. ఇందుఁ గొన్ని యప్రామాణికములగు 'శబ్దరూపము'లందందుఁ గలవు. ఇందు దేవవర్గున నింద్రపరమగు 'చట్టుపల్ దెగ గట్టఁ గొట్టెడు జెట్టి' యనుపద్యమునందు 'దుగబోట్లపిరుదయైదుకనుంగవలవేల్పు' అనుసమాసములో 'పిరుద' యనుశబ్ద మొకటి కనుపట్టుచున్నది ఇదిపిఱుఁదుశబ్దము సప్తమ్యేకవచన మైనచో నప్పుడు వ్యస్తపద మగును. కాఁబట్టి యీసమాసము నడుమ నుండఁదగదు. కావున నిది పిఱిఁది యని యుండవలయును. అయినను బెక్కుప్రతులందు 'పిరుద' యనియేరూపము గనఁబడుచున్నది. ఈ రూపమున కుపబలముగా నాంధ్రనామ శేషమున 'తొడరుం బశ్చాద్భాగము, వెడ యనఁగా వెనుకయనఁగఁ బిరుద యనం గన్"అనిదానిప్రతులు పెక్కింటఁ జూపట్టుచున్నది. నిఘంటుకారులు దొలుత దీని నెట్లు వ్రాసియుండిరో తెలియదు గాని యీరెండు నిఘంటువులయందును నించుమించుగా వాని ప్రతు లన్నింటను పిరుద యనియే రూపము కానంబడుటచే నట్టియుకారాంతశబ్దము వేఱొకటి కలదేమో యని సందియము

కలుగుచున్నది. కాని ప్రయోగములందదిచాల మృగ్యమగుట చే సమంజస మనుటకు సాహసము పుట్టకున్నది. కావున దానిని పిఱ్ఱిది యనియే దిద్దియున్నాఁడను. బూరుగుశబ్దము బూరగొట్టమునకును బూరుగుచెట్టునకును వేరుగాఁ జెప్పఁబడి యున్నది. కాని మొదటియర్థము 'బూరగ' యనుశబ్దమునకే, కాని 'బూరుగు'నకుఁ గానిపింపదు. తాళవృక్షవాచక మగు తాడు శబ్దమునకు రజ్జు వనియు నర్థాంతము చెప్పఁబడి యున్నది. త్రాడుశబ్దమునకే యీయర్థము చూపట్టుచున్నదే కాని 'తాడు' నకుఁగాదు. కైదువు, నెమిలి, జమిలి అనునీమూఁడుశబ్దములును వరుసగా కైదువ, నెమిలి, జమిలి యని ప్రతులయం దెల్లఁ గానిపించుచున్నవి.

## ఆంధ్రనామశేషము.

దీనిని రచించినకవి అడిదము సూరనకవి; బాలభాస్కరుని పుత్రుఁడు. ఇతఁడు నియోగి; మఱి కవిజనరంజనము, కవిసంశయ విచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకము, రామలింగేశ్వర శతక మని నాలుగు గ్రంథములనుగూడ రచించెను. ఇతఁడు పదునెనిమిదవ శతాబ్దమునం దున్నట్లు చెప్పఁబడినది. ఈ ఆంధ్రనామశేషము చాల నిర్దుష్టముగా నున్నది. ఆంధ్రనామ సంగ్రహమున లేని శబ్దములను నిది తెలుపుచున్నది. ఇది వర్గులుగా విభక్తము కాలేదు.

## సాంబనిఘంటువు.

ఇది కస్తూరిరంగకవిచే రచింపఁబడినది. ఇతఁడు వేంకటేశ్వరాంధ్రమును జూచియే దీనిని రచించెనని చెప్పవచ్చును.

ఆయా పదముల కా నిఘంటువునఁ గల పర్యాయముల వల్లె
దీనియందుఁ బెక్కుచోట్ల నుంచియుండుటఁ జూడవచ్చును.
వేయేల! దానినిగొనియే రంగకవి దీనిని రచింపఁ జాలినాఁ డనుట
సాహసము కాదు. అయిన నది దీనికంటెఁ గొంతవిపులము
గాను మఱింత ప్రౌఢము గాను మిగుల సలక్షణము గాను జూప
ట్టుచున్నది. ఇందుఁ బ్రయోగసిద్ధములుగాక వ్యవహారైకశర
ణంబులగు శబ్దంబులును, వ్యాకరణదుష్టంబులగు శబ్దరూపంబు
లును బెక్కులు గానంబడుచున్నవి. ముఖ్యములైనవాని నెత్తి
వ్రాసెద. నేఁడుశబ్దము అక్కినేడు మొదలగు తెనుఁగుదేశపుఁ
బురుషనామములందు రాజు అనునర్థము గలదై కానిపించు
చున్నది కాని ప్రయోగదృశ్యము కాదు. కార్బారి యని పెక్కు
ప్రతులందుఁ జూపట్టుటచేతను వ్యవహారమాత్రదృశ్యంబులగు
నిట్టిశబ్దంబు లిందనేక ముండుటచేతను దీనినట్లే యుంచినాఁ
డను. ఇటీవల ముద్రితములైన ప్రతులలో నిది నేర్పరి యని
దిద్దఁబడి యున్నది. కాని ఈదిద్దుపా టెంతవఱకు యుక్తమో
తెలియరాదు. అజ్జు శబ్దమునకుఁ బర్యాయముగా అఱుత
శబ్దము చెప్పఁబడియున్నది. ఈశబ్దమును 'అజ్జు' శబ్దమునకంటె
వేఱైనదానినిగా గ్రహించినట్లు తోఁచుచున్నది. పారితోషిక
వాచకమగు 'పసదము'నకు అన్నమనెడి యర్థము విచారణీయము.
జాగిలి యనుశబ్దము దండపర్యాయమగు విశేష్యముగా
నెచటను గానము. దీనికి మూలమగు వేంకటేశ్వరాంధ్రమునఁ
గల 'జాగిలుట' అనుక్రియనుండి జాగిలియను విశేష్యమును దీసి
నట్లున్నది, 'చాగిలు' అనుక్రియయే యిట్లు తప్పుగా గ్రహింపఁ
బడియుండు నని తోఁచెడిని. బట్టుది, మద్దత్తు, పర్వాలు ననెడి

యీమూఁడుశబ్దములు వ్యవహారమాత్రసిద్ధంబులుగాని ప్రయోగములందు మృగ్యములుగా నున్నవి. గానయమే మార్గ్వాచకమ్ము కాని గానము కాదు. వేంకటేశ్వరాంధ్రమునఁ గల వెక్కిరింతమెకము, గుర్గురించుమెకము, చప్పరించుమెకము, ప్రమానిపోటుపులుఁగు, అనువానిలో యుత్తరపదములను విడిచి యిందుఁ గ్రమముగా వెక్కిరింత, గుర్గురింత, చప్పరింత, ప్రమానిపోటుపు, అని క్రియలనుమాత్రము రంగకవి వ్రాసియున్నాఁడు. క్రియామాత్రములే యాయామృగాదినామము లెట్లు కాఁగలవు? ఇట్లానిఘంటువునుండి శబ్దములు పెక్కులు కొంతమార్పుతోనిం దుంపఁబడి తప్పులై కానిపించుచున్నవి.

ఆంధ్రనామసంగ్రహమునకును ఆంధ్రనామశేషమునకును మున్ను పండితులు వ్రాసియుండిన టీకలనే యయ్యెయెడల సవరించి కూర్చియున్నాఁడను. సాంబనిఘంటువున కిది వఱలో నేటీకయును లేమింజేసి నేను దానికిఁ గ్రొత్తగా నొకటి రచించినాఁడను. ఈనిఘంటులోని యౌగికపదంబులకుఁ జాలవఱకు నవయవార్థములును ప్రతిశబ్దమునకును బర్యాయముల సంఖ్యయు వ్రాయంబడి యున్నవి. గుణదోషగ్రహణనిపుణు లగుపండితశిఖామణు లిందుఁగల దోషములను దెలిపి దీనికి మఱింత వన్నె కలిగింతురు గాక యని నమ్ముచున్నాఁడను.

ఇట్లు,

తం. తేవప్పెరుమాళ్లయ్య

—:o:—

శ్రీ ర స్తు.

# సటీకాంధ్రనామసంగ్రహము

## దేవవర్గు.

### అవతారిక.

పైఁడిపాటి లక్ష్మణకవిమంత్రి యాంధ్రనామ సంగ్రహమనెడి యీ నిఘంటువును రచియింపఁ బూని యిది నిర్విఘ్నముగా పరిసమాప్తినొందుటకొఱకు నాదియందు నిష్టదేవతా నమస్కార రూపమంగళము నాచరించువాఁడై యిట్లాచరించుట శిష్టాచారమని శిష్యజనులకుఁ దెలియుటకొఱకు నామంగళమును గ్రంథరూపముగా 'శ్రీపతివంద్య' యను తొలిపద్యమున నిబంధించుచున్నాఁడు. పిదప రెండు పద్యములందును తనయిష్టదైవమగు విశ్వనాథునికి స్తుతిపూర్వకముగా నీగ్రంథము నంకితము సేయుటయు, గ్రంథనామము స్వనామము మున్నగునవియుఁ దెలుపుచున్నాఁడు. మొదటి మూఁడు పద్యములు నేకాన్వయము గలవి యని యెఱుంగదగు.

క. శ్రీపతివంద్యు విశాలా
శ్రీపతిని భజించి యిష్టసిద్ధుల వరుసం
బ్రాపింపఁగ గణనాథుని
శ్రీపాదంబులకు నెఱఁగి చెందినవేడ్కన్. 1

నతభక్తలోకరక్షా
రతికిం జంచత్కృపాతరంగితమతికిన్
శతమఖముఖసురనుతిసం
గతికిన్ మహిమోన్నతికిని గాశీపతికిన్. 2

సీ. అంకితంబొనర్తుఁ దెనుఁగుపేళ్లరసి కూర్చి
గరిమతో నాంధ్రనామసంగ్రహ మనంగ
నమరుకృతిఁ బైఁడిపాటి యేకామ్రమంత్రి
సుతుఁడఁ గవిలక్ష్మణాఖ్యుఁడ సుజనహితుఁడ. 3

టీ. ఇష్టసిద్ధులన్-ఇష్ట=కోరఁబడిన, సిద్ధులన్=పనులు చక్కఁబడు టలను, వరుసన్ = క్రమముగా, ప్రాపింపఁగన్ = పొందుటకు, శ్రీపతి వంద్యున్-శ్రీ=సంపదధిష్ఠాన దేవత యగులక్ష్మీదేవికి, పతి = నాయకుఁడగు శ్రీమన్నారాయణునికి, వంద్యున్ = ఆరాధింపఁదగ్గవాఁడైన, విశాలాక్షీ పతిని=విశాలాక్షియనెడు పేరిటఁ బ్రసిద్ధినొందిన యుమయనుపార్వతీదేవికి పెని మిటియగు విశ్వేశ్వరుని, భజించి=సేవించి, గణనాథుని శ్రీపాదంబులకున్- గణ=ప్రమథాదిగణములకు, నాథుని = ప్రభువగు విఘ్నేశ్వరునియొక్క, శ్రీ పాదంబులకున్ = శుభకరము లగునడుగులకు, ఎఱఁగి = వందనముసేసి, చెందిన=పొందిన, వేడ్కన్ = ఆనందముతో, పైఁడిపాటియేకామ్రమంత్రి సుతుఁడనౌ = పైఁడిపాటి యనుగృహనామము గల యేకామ్రమంత్రికి పుత్త్రుఁడను, సుజనహితుఁడన్=సుజన = సత్పురుషులకు, హితుఁడన్ = యిష్టుఁడైనవాఁడును, కవిలక్ష్మణాఖ్యుఁడన్-కవిలక్ష్మణ = కవిలక్ష్మణుఁడనెడి ఆఖ్యుఁడన్ = నామముగలవాఁడు నగు నేను, తెనుఁగుపేళ్లు=ఆంధ్రభాషా శబ్దములను, అరసి=నిఖిలాంధ్రగ్రంథములయందు విమర్శించి, కూర్చి=ఆయా పర్యాయములతోఁజేర్చి, ఆంధ్రనామసంగ్రహము-ఆంధ్రనామ = తెనుఁగు మాటలయొక్క, సంగ్రహము = సంక్షేపించి చెప్పుట, అనంగన్ = అని వ్యవహరించుటచేత, గరిమతోన్ = గౌరవముతో, అమరు=తగయుండెడి, కృతిన్ = గ్రంథమును, నతభక్తలోక రక్షారతికిన్ - నత=నమస్కరించు

వాఁడును, భక్త=భక్తులును అగు, లోక=జనులయొక్క, రక్షా=కాపాడుట యందు, రతికిన్=ఆసక్తిగలవాఁడును, చంచత్కృపాతరంగితమతికిన్ - చంచత్ = కదలుచునుండెడు. కృపాతరంగిత = దయారసతరంగములతోఁ గూడిన, మతికిన్=మానసముగలవాఁడును,శతమఖముఖసురనుతిసంగతికిన్ - శతమఖముఖ = దేవేంద్రుఁడు మొదలైన, సుర = దేవతలయొక్క, నుతి = స్తోత్రములయొక్క, సంగతికిన్ = సందర్భము గలవాఁడును, మహిమోన్నతికిని = ప్రభావాధిక్యముగల వాఁడునైయున్నట్టి. కాశీపతికిన్-కాశీ= వారణాసీ పురికి, పతికిన్ = ప్రభువగు విశ్వేశ్వరునికి, అంకితము ఆవిశ్వేశ్వరునిపేరఁ గృతినిచ్చుటను, ఒనర్తున్ = చేయుదును.

అవతారిక. ఇపుడు గ్రంథకర్త తానుజేయంబూనిన గ్రంథమునందు సంకేతంబును దెలియఁ జేయుచున్నాఁడు.

తే. దేవ మానవ స్థావరతిర్యగాఖ్య
వర్గు లొనరింతు నానార్థవర్గుఁ గూడ
వర్గములు గాఁగఁ గూర్తు నాహ్వయములందు
నిడుదు వివరించునెడల సంస్కృతపదంబు. 4

టీ దేవమానవస్థావరతిర్యగాఖ్యవర్గులు=దేవవర్గు. మానవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు అను పేళ్లుగల నాలుగువర్గులను - నానార్థవర్గుగూడన్ = నానార్థవర్గువన్నుఐదవవర్గునైతము, ఒనరింతున్ = చేసెదను. అందును = ఆవర్గులయందును, ఆహ్వయములు = పేళ్లను, వర్గములుగాఁగఁ గూర్తున్ = ఒకటికి నొకటికి సంబంధము గల వానినిగాఁ జేర్తును, వివరించునెడలన్ = అర్థమునుదెలియఁబలుకునెడల, సంస్కృతపదంబున్ = సంస్కృతపదమును ఇడుదున్ = ఉంతును

అవతారిక. ఇపుడు గ్రంథకర్త కృతిపతియగు విశ్వేశ్వరుని సంబోధనచేసి యెచ్చరికను జెప్పుచున్నాఁడు.

క. శ్రీలలనాధిపవంద్య వి
శాలాక్షీప్రాణనాథ శతమఖముఖది

నతభక్తలోకరక్షా
రతికిం జంచత్కృపాతరంగితమతికిన్
శతమఖముఖసురనుతిసం
గతికిన్ మహిమోన్నతికిని శ్రీగౌరీపతికిన్. 2

అంకితముగ నే దెనుఁగుపేళ్లరసి కూర్చి
గరిమతో నాంధ్రనామసంగ్రహ మనంగ
నమరుకృతి పైడిపాటి యేకామ్రమంత్రి
సుతుఁడఁ గవిలక్ష్మణాఖ్యుఁడ సుజనహితుఁడ. 3

టీ. ఇష్టసిద్ధులన్-ఇష్ట=కోరఁబడిన, సిద్ధులన్=పనులు చక్కఁబడు
లను, వరుసన్ = క్రమముగా, ప్రాపింపఁగన్ = పొందుటకు, శ్రీపతి
వంద్యున్-శ్రీ=సంపదధిష్ఠాన దేవత యగులక్ష్మీదేవికి, పతి = నాయకుఁడగు
శ్రీమన్నారాయణునికి, వంద్యున్ = ఆరాధింపఁదగ్గవాఁడైన, విశాలాక్షీ
పతిని=విశాలాక్షియనెడు పేరటఁ బ్రసిద్ధిఁ బొందిన యుమయను పార్వతీదేవికి పెని
మిటియగు విశ్వేశ్వరుని, భజించి=సేవించి, గణనాథుని శ్రీపాదంబులకున్-
గణ=ప్రమథాదిగణములకు, నాథుని = ప్రభువగు విఘ్నేశ్వరునియొక్క, శ్రీ
పాదంబులకున్ = శుభకరము లగునడుగులకు, ఎఱఁగి = వందనముసేసి,
పొందిన=పొందిన, వేడ్కన్ = ఆనందముతో, పైఁడిపాటియేకామ్రమంత్రి
సుతుఁడను = పైఁడిపాటి యనుగృహనామము గల యేకామ్రమంత్రికి
పుత్త్రుఁడను, సుజనహితుఁడన్=సుజన = సత్పురుషులకు, హితుఁడన్ =
యిష్టుఁడైనవాఁడును, కవిలక్ష్మణాఖ్యుఁడన్-కవిలక్ష్మణ = కవిలక్ష్మణుఁడనెడి
ఆఖ్యుఁడన్ = నామముగలవాఁడు నగు నేను, తెనుఁగుపేళ్లు=ఆంధ్రభాషా
శబ్దములను, అరసి=నిఖిలాంధ్రగ్రంథములయందు విమర్శించి, కూర్చి=ఆయా
పర్యాయములతోఁ జేర్చి, ఆంధ్రనామసంగ్రహము-ఆంధ్రనామ = తెనుఁగు
మాటలయొక్క, సంగ్రహము = సంక్షేపించి చెప్పుట, అనఁగన్ = అని
వ్యవహరించుటచేత, గరిమతోన్ = గౌరవముతో, అమరు=తగియుండెడి,
కృతిన్ = గ్రంథమును, నతభక్తలోక రక్షారతికిన్ - నత=నమస్కరించు

వాఁడును, భక్త=భక్తులును అగు, లోక=జనులయొక్క, రక్షా=కాపాడుట యందు, రతికిన్=ఆసక్తిగలవాఁడును, చంచత్కృపాతరంగితమతికిన్ - చంచత్ = కదలుచునుండెడు, కృపాతరంగిత = దయారసతరంగములతోఁ గూడిన, మతికిన్=మానసంబుగలవాఁడును,శతమఖముఖసురనుతిసంగతికిన్ - శతమఖముఖ = దేవేంద్రుఁడు మొదలైన, సుర = దేవతలయొక్క, నుతి = స్తోత్రములయొక్క, సంగతికిన్ = సందర్భము గలవాఁడును, మహిమోన్నతికిని = ప్రభావాధిక్యముగల వాఁడునై యున్నట్టి. కాశీపతికిన్ - కాశీ= వారణాసీ పురికి, పతికిన్ = ప్రభువగు విశ్వేశ్వరునికి, అంకితము ఆవిశ్వేశ్వరునిపేరఁ గృతినిచ్చుటను, ఒనర్తున్ = చేయుదును.

అవతారిక. ఇపుడు గ్రంథకర్త తానుజేయంబూనిన గ్రంథమునందు సంకేతంబును దెలియఁ జేయుచున్నాఁడు.

తే. దేవ మానవ స్థావరతిర్యగాఖ్య
వర్గు లొనరింతు నానార్థవర్గుఁ గూడ
వర్గములు గాఁగఁ గూర్తు నాహ్వాయములందు
నిడుదు వివరించునెడల సంస్కృతపదంబు. 4

టీ దేవమానవస్థావరతిర్యగాఖ్యవర్గులు=దేవవర్గు. మానవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు అని పేళ్లుగల నాలుగువర్గులను - నానార్థవర్గుగూడన్ = నానార్థవర్గువనుఐదవవర్గుసైతము, ఒనరింతున్ = చేసెదను. అందును = ఆవర్గులయందును, ఆహ్వాయములు = పేళ్లను, వర్గములుగాఁగఁ గూర్తున్ = ఒకటికి నొకటికి సంబంధము గల వానినిగాఁ జేర్తును, వివరించునెడలన్ = అర్థమునుదెలియఁబలుకునెడల, సంస్కృతపదంబున్ = సంస్కృతపదమును ఇడుదున్ = ఉంతును.

అవతారిక. ఇపుడు గ్రంథకర్త కృతిపతియగు విశ్వేశ్వరుని సంబోధనచేసి యెచ్చరికను జెప్పుచున్నాఁడు.

క. శ్రీలలనాధిపవంద్యా వి
శాలాక్షీప్రాణనాథ శశతమఖముఖది

క్పాలాభీష్టద సమధిక
శీలా కాశీనివేశ శ్రీవిశ్వేశా 5

టీ. శ్రీలలనాధిప = లక్ష్మీకాంతకు అధిపతియయినట్టి శ్రీవిష్ణువునకు, వంద్య = పూజ్యుఁడవును, విశాలాక్షీప్రాణనాథ = విశాలాక్షీదేవికిఁ బెనిమిటియును, శతమఖముఖదిక్పాలాభీష్టద = దేవేంద్రుఁడు మొదలగుదిక్పతులకు నభీష్టములనిచ్చువాఁడవును, సమధిక శీలా - ఎక్కువశీలముగలవాఁడవును, కాశీనివేశ = కాశీపట్టణముస్థానముగాఁ గలవాఁడవునైన-శ్రీవిశ్వేశా = శ్రీమంతుఁడవగు విశ్వేశ్వరస్వామీ! అవధరింపుము.

## దేవవర్గు.

సీ. ముక్కంటి యరపదిమోముల వేల్పు
మినుసిగదయ్యంబు మిత్తిగొంగ
గట్టువిల్తుఁడు కఱకంఠుఁడు మిక్కిలి
కంటిదేవర జేసికంటివేల్పు
వలిమలల్లుఁడు మిన్నువాఁకతాల్పు కొండ
వీటిజంగము గుజ్జువేల్పుతండ్రి
వలరాజుసూడు జక్కులఱేనిచెలికాఁడు
బూచులయెకిమీఁడు పునుకతాల్పు
తే. విసపుమేఁతరిజన్నంపువేఁటకాఁడు
బుడుతనెలతాల్పు వెలియాలపోతురౌతు
తోలుదాలుపు మున్మొనవాలుదాల్పు
నాఁగ భవదాఖ్య లొప్పు సంధకవిపక్ష. 6

టీ. ముక్కంటి=మూఁడుకన్నులుగలవాఁడు, అరపదిమోములవేలుపు= అయిదుముఖములుగల దేవుఁడు, మినుసిగదయ్యంబు = ఆకాశము శిఖగాఁగల దేవుఁడు, మిత్తిగొంగ=మృత్యువును సంహరించినవాఁడు, గట్టువిల్తుఁడు = మేరుపర్వతమువిలుగాఁగలవాఁడు, కఱకంఠుఁడు = నల్లనికంఠముగలవాఁడు

ముక్కొలి కంటిదేవర=ఎక్కువ కన్నులుగల దేవుఁడు, వేసికంటివేల్పు=వేసి సంఖ్యయైనమూఁడు కన్నులుగల దేవుఁడు, వలిమలల్లుఁడు = హిమవంతునకు అల్లుఁడు, మిన్నువాఁకతాలుపు=ఆకాశపునదిని (గంగను) ధరించినవాఁడు, కొండవీటిజంగము=కైలాసపర్వతము పట్టణముగాఁగలిగిన భిక్షుకస్వరూప ధారి, గుజ్జువేల్పుతండ్రి=విఘ్నేశ్వరునకుఁదండ్రి, వలరాజుసూడు=మన్మథు నకుఁ బగవాఁడు, జక్కులఱేనిచెలికాఁడు=యక్షరాజగు కుబేరునకున్నేహి తుఁడు, బూచులయేలిమీఁడు=పిశాచములకురాజు, పునుకతాల్పు = బ్రహ్మ కపాలమును ధరించినవాఁడు, విసప్రేమేఁతరి = విషమును భక్షించినవాఁడు, జన్నరిపువేఁటకాడు=దక్షయజ్ఞ ధ్వంసకుఁడు, బుడుతనెలతాల్పు = బాల చంద్రుని ధరించినవాఁడు. వెలియాలపోతురౌతు = ధవళవృషభ మెక్కు వాఁడు, తోలుదాలుపు=చర్మమునుధరించినవాఁడు, ముమ్మొనవాలుదాల్పు = మూఁడు మొనలుగల ఆయుధమును-అనఁగా త్రిశూలమును, ధరించినవాఁడు, నాఁగ=అనఁగా, ఈ ౨౬ను, అంధకవిపక్ష=అంధకాసురునకు శత్రు వైన ఓశివా, భవదాఖ్యలొప్పున్=నీ పేళ్లు తగును.

ప్రకృతివికృతులు—శిఖ=సిగ, మృత్యువు = మిత్తి, యక్షులు = జక్కులు, విషము=జన్నము.

సీ. సోఁకుమూఁకలగొండ కి చుట్టుఁగైదువుజోదు
పచ్చవిల్తునితండ్రి కి లచ్చిమగఁడు
పులుఁగుతత్తడిరౌతు కి వలమురితాలుపు
వెన్నుఁడు కటివేల్పు కి వెన్నదొంగ
నునుగాడ్పుదిండిషాకినుపునఁ బండెడు మేటి
బమ్మదేవరతండ్రి కి తమ్మికంటి

పదివేసములసామి పసిఁడిపుట్టముదాల్పు
కవ్వెనెచ్చెలి తరిగట్టుదారి
తే. ఆలకాపరి వ్రేఁతలమేలువాఁడు
పాలకడలల్లుఁడును బక్కిడాలుఱేఁడు
రేయుఁబవలును జేయుకన్దోయివాఁడు
మామమా మన హరి యొప్పు శ్రీమహేశ. 7

టీ. సోఁకుమూఁకలగొంగ = రాక్షససమూహములను గొట్టువాఁడు, చుట్టుఁగైదువుజోదు=గుండ్రనిఆయుధమును (అనఁగా సుదర్శనచక్రమును) ధరించినయోధుఁడు, పచ్చవిల్తునితండ్రి = పచ్చనివిల్లుగలవానికి (మన్మథు, నకు) తండ్రి, లచ్చిమగఁడు=లక్ష్మీదేవికిఁ బెనిమిటి, పులుఁగుతత్తడిరౌతు = గరుడవాహనము నెక్కువాఁడు, వలమురితాలుపు=దక్షిణావర్తమగు పాంచజన్యశంఖమును ధరించినవాఁడు, వెన్నుఁడు=విష్ణుఁడు-సర్వప్రపంచమందు వ్యాపించియున్నవాఁడు, కఱివేల్పు = నల్లనిదేవుఁడు, వెన్నదొంగ = వెన్న దొంగిలించినవాఁడు, నునుగాడ్పుదిండి పానుపునఁ బండెడిమేటి-పాఠాంతరము॥నునుగాలిమేఁత పానుపునఁ బండెడిదొర=మృదువాయువును భక్షించు శేషుఁడను పానుపునందు శయనించుదిట్ట, బమ్మదేవరతండ్రి=బ్రహ్మదేవునకుఁ దండ్రి, తమ్మికంటి = పద్మములవంటి నేత్రములు గలవాఁడు, పదివేసముల సామి = దశావతారస్వరూపములను ధరించిన దేవుఁడు, పసిఁడిపుట్టము తాల్పు=కనకాంబరధారి, కవ్వెనెచ్చెలి=అర్జునునకు స్నేహితుఁడు, తరిగట్టు దారి=కవ్వపుఁగొండను (మందరపర్వతమును) ధరించినవాఁడు, ఆలకాపరి= గోవులను గాచినవాఁడు - వ్రేఁతలమేలువాఁడు = గోపస్త్రీలకు ఇష్టుఁడు, పాలకడలల్లుఁడు = క్షీరసముద్రునకు అల్లుఁడు, పక్కిడాలుఱేఁడు=గరుడ ధ్వజముగలరాజు, రేయుఁబవలును జేయుకన్దోయివాఁడు = రాత్రినిబగటిని జేయునట్టి చంద్రసూర్యులు నేత్రద్వయముగాఁ గలవాఁడు, మామమామ =

మూమ యగుసముద్రముకుమామ, అననీ ౨౨ వేళ్ల చేతను, హరియొప్పఁ = విష్ణు వొప్పును. ప్ర. వి.-లక్ష్మి=లచ్చి, రాహుత్త=రౌతు, విష్ణుఁడు = వెన్నుఁడు, బ్రహ్మ=బమ్మ; వేషము=వేసము,

సీ. పక్కిడాల్వేలుపుఁ బొక్కిలిపసిబిడ్డఁ
డంచ తేజి నెక్కి యాడురౌతు
మనెడుప్రొద్దుల్ల నొసళ్లను వ్రాయుదేవర
చదువులవేనుపు జన్నిగట్టు
తెలిదమ్మిగద్దియఁ గొలువుండురాయఁడు
నిక్కంపుజగ మేలునేర్పుకాఁడు
కడుపు బంగారుబొక్కసమ్ముఁ జేసినమేటి
పోరోగిరము తిండిపోతుతండ్రి

ఆ. నలువ తమ్మిచూలి నలుమొగంబులవేల్పు
వేల్పుపెద్ద పలుకుచెలఁదిమగఁడు
తాత బమ్మ యన విధాతనామము లొప్పు
నఘవినాశ యీశ యభ్రకేశ. 8

టీ. పక్కిడాల్వేలుపు పొక్కిలి పసిబిడ్డఁడు = విష్ణువుయొక్క నాభి వలననుండి పుట్టిన పసిబాలుఁడు, అంచతేజినెక్కియాడురౌతు = హంసవాహనము నెక్కితిరిగెడుయోధుఁడు, మనెడుప్రొద్దులనొసళ్ల వ్రాయుదేవర = జీవించెడికాలములను నొసళ్లయందు వ్రాయునట్టిదేవుఁడు, చదువులవేలుపు = విద్యలకుదేవుఁడు, జన్నిగట్టు=యజ్ఞోపవీతమును ధరించినవాఁడు, తెల్లిదమ్మిగద్దియఁగొలువుండురాయఁడు=శ్వేతపద్మమనెడిసింహాసనమందుఁగూర్చుండి

యేలురాజు, నిక్కుపుజగవేలు నేర్పుకాఁడు=సత్యలోకము నేలునట్టి నేర్పు గలవాఁడు, కడుపుబంగారుబొక్కసముఁ జేసిన మేటి=గర్భమును బంగారపు గొట్టుఁగాఁ జేసికొన్నదిట్ట, పోరు ఒగిరము తీండ్రపోతుతండ్రి = కలహమే యన్నముగాఁగల నారదునకుఁ దండ్రి, నలుపే=నాలుగునోళ్లు గలవాఁడు, తమ్మిచూలి=పద్మమందుఁ బుట్టినవాఁడు, నలుమొగంబుల వేల్పు=నాలుగు ముఖములుగల దేవుఁడు, వేల్పు పెద్ద=దేవతలలో పెద్ద, పలుకువెలఁదిమగఁడు= సరస్వతికిఁ బెనిమిటి, తాత, బమ్మ-ఈ ౧౬ను బ్రహ్మపేళ్లు.

తే. గట్టురాయనిపట్టి ముక్కంటివెలఁది
యేనుఁగులగొంగత త్తడిన్నెక్కుదంట
సామిసామేనిఁ జేకొన్నచాన జగము
తల్లి యన గౌరిపేళ్లొప్పు ధర నుమేశ. 9

టీ. గట్టురాయనిపట్టి = పర్వతరాజగు హిమవంతునకుఁ గూఁతురు, ముక్కంటివెలఁది=మూఁడుకన్నులుగల ఈశ్వరునికిభార్య, ఏనుఁగులగొంగ తత్తడి నెక్కుదంట=ఏనుఁగులకు శత్రువైన సింహవాహనము నధిష్ఠించు దిట్టరి, సామిసామేనిఁ జేకొన్నచాన= పెనిమిటియొక్క అర్ధాంగము నలంకరించిన చిన్నది, జగముతల్లి=లోకమాత ఈ ౮ పార్వతి పేళ్లు.

తే. లచ్చి కలుములజవరాలు పచ్చవిల్తు
తల్లి కతివేల్పునిల్లాలు తల్లి తల్లి
కడలికూఁతురుసిరి లిబ్బిపడఁతి తమ్మి
యింటిగరి తన శ్రీ యొప్పు మృగధరాంక. 10

టీ. లచ్చి=లక్ష్మి, కలుములజవరాలు=భాగ్యప్రదయైన దేవత, పచ్చవిల్తునితల్లి =, మన్మథునితల్లి, కతివేల్పునిల్లాలు = విష్ణువునకుభార్య తల్లి

తల్లి=తల్లియైనగంగకుఁదల్లి॥పా॥ తాతతల్లి=బ్రహ్మకుఁదల్లి, కడలికూఁతురు=సముద్రునికూఁతురు, సిరి, లిబ్బిపడఁతి=ధననిక్షేపములయందుండు దేవత, తమ్మియింటిగరిత=పద్మాలయమునందుండు స్త్రీ.-ఈ౯ లక్ష్మిదేవి పేళ్లు.

క. తలవాకిటను మెలఁగెడు
 పొలఁతుక పలుకులవెలఁది పొత్తముముత్తో
 నలువపడఁతి కలుముల పై
 దలికోడ లనంగఁ బరఁగు ధర వాణి శివా! 11

టీ. తలవాకిటను మెలంగెడుపొలఁతుక=తలయొక్క వాకిలియైన నోటిలో సంచరించుచున్నది. పలుకులవెలంది=విద్యలుగలచిన్నది, పొత్తముముత్తో=పుస్తకమందుండెడిముత్తయిదువ, నలువపడంతి=బ్రహ్మభార్య, కలుములపైదలికోడలు=లక్ష్మికిఁ గోడలు. ఈ ౫ సరస్వతికిఁ బేళ్లు.

సీ. ఇద్దఱుతల్లులముద్దుబిడ్డఁడు పని
 చెఱుపులదొర చేటచెవులవేల్పు
 వంకరతొండంబువాఁ డేనుఁగు మొగంబు
 దేవర పాపజందెముల మేటి
 బ్రొక్కువారలపనుల్ చక్కఁ జేసెడుసామి
 గఱికపూజలమెచ్చుగబ్బివేల్పు
 ముక్కంటిపండులమొక్కతిండీఁడు
 ముక్కంటిగారాబుముద్దుపట్టి

ఆ. పెద్దకడుపువేల్పు పిళ్లారి కుడుముల
 తిండికాఁడు కొక్కుతేజిరౌతు
 గుజ్జువేలు పొంటికొమ్ముదేవర వెన
 కయ్య యన వినాయకాఖ్య లీశ. 12

టీ. ఇద్దఱుతల్లులముద్దుబిడ్డఁడు = గంగాపార్వతులకుఁ బ్రియసుతుఁడు, పనిచెఱుపులదొర = విఘ్నములకు నాయకుఁడు, చేటచెవులవేల్పు = చేటలవంటిచేవులు గలదేవుఁడు, వంకరతొండంబువాఁడు = వంకరతొండముకలవాఁడు, ఏనుఁగుమొగంబుదేవర = ఏనుఁగుముఖముగలదేవుఁడు, పాపజందెములమేటి = సర్పములను యజ్ఞోపవీతములునుగా ధరించినదిట్టరి, మ్రొక్కువారలపనుల్ చక్కఁజేసెడుసామి = మ్రొక్కునట్టివారిపనులు బాగుగాఁజేయు దేవుఁడు, గఱికపూజలమెచ్చుగబ్బివేల్పు = గఱికపూజలనుమెచ్చునట్టి గొప్ప దేవుఁడు, ముక్కంటిపండులమెక్కెడితిండీఁడు = టెంకాయలను దిను బలవంతుఁడు, ముక్కంటిగారాబుముద్దుపట్టి = ఈశ్వరున కత్యంతప్రియకుమారుఁడు, పెద్దకడుపువేల్పు = గొప్పబొజ్జగలదేవుఁడు, పిళ్ళారి, కుడుములతిండికాఁడు = కుడుములనుభక్షించువాఁడు, కొక్కుతేజిరౌతు = మూషకవాహనము నెక్కువాఁడు, గుజ్జువేలుపు = పొట్టి దేవుఁడు, ఒంటికొమ్ముదేవర = ఒంటిదంతముగలదేవుఁడు. ఈ ౧౫ వినాయకుని పేళ్లు.

ప్ర. వి. తుండము = తొండము, వినాయకుఁడు = వెనకయ్య.

సీ. వెనుఁబాఁపకవణంబుఁ ♦ దినువారువముతౌతు
గట్టులయెకిమానిపట్టిపట్టి
తెల్లుచూ లార్గురుతల్లులకొమరుండు
గాడుపునంగడికానికొడుకు
పుంజుదాలుపు వేలుపులజేనిదళవాయి
జంటముమోమ్ములదంటవేల్పు
కొంచగుబ్బలిప్రక్క ♦ లించినబలుదిట్ట
రెండాఱుచేతుల ♦ దండిమగఁడు

తే. వేలుపులమూఁకపేరిటి ♦ వెలఁదిమగఁడు
వేల్పుగమికాఁడు వెనకయ్యవెనుకవాఁడు

కొమరుసామి మన సేనాని కొమరు మిగులు
విగతభవపాశ కాశీనివేశ యీశ 13

టీ. పెనుఁబాఁపకపఁబంబుఁదినువారువపురౌతు = పెద్దపామును ముద్దగా భక్షించు నెమలి నెక్కువాఁడు, గట్టులయొకిమీనిపట్టిపట్టి = హిమవంతుని పుత్రియగు పార్వతికి కొమారుఁడు, జెల్లుచూలు = జెల్లునందుఁబుట్టినవాఁడు, ఆర్గురుతల్లులకొమరుండు = షట్కృత్తికల కొమారుఁడు, గాడుపుసంగడికాని కొడుకు = వాయుసఖుఁడగు అగ్ని కొమారుఁడు, పుంజుడాలుపు = కుక్కుటమును ధ్వజమందు ధరించినవాఁడు, వేలుపులజేనిదళవాయి = ఇంద్రుని యొక్క సేనానాయకుఁడు, జంటమూమోమ్ములదంట వేల్పు = ఆఱుముఖములు గల దిట్టయైన దేవుఁడు, కొంచగుబ్బలివ్రక్కలించినబలుదిట్ట = క్రౌంచాద్రిని భేదించిన యధికబలశాలి, రెండాఱు చేతులదండిమగఁడు = పండ్రెండు చేతులుగల దిట్టయైన పురుషుఁడు, వేలుపులమూఁక పేరిటి వెలఁదిమగఁడు = దేవసేనయను పేరుగలచిన్నదాని పెనిమిటి, వేల్పుగమికాఁడు = దేవతలకు మొనగాఁడు, వెనకయ్యవెనుకవాఁడు = విఘ్నేశ్వరునకు వెనుకఁ బుట్టినవాఁడు, కొమరుసామి-ఈ ౧౪ కుమారస్వామిపేళ్లు.

ప. వి. క్రౌంచము=కొంచ, కుమారస్వామి=కొమరుసామి.

సీ. అలరువిల్తుండు కన్నులవిల్తుఁడును గన్న
విలుకాఁడు చక్కెరవింటివాఁడు
చెఱకువిల్కాఁడు కెంజిగురులవిల్తుఁడు
వెడవిల్తుఁడును బచ్చవిల్తుఁ డించు
విల్లుదాలుపు తుంటవిలుకాఁడు తియ్యవి
ల్కాఁడును జమిలిముకాలినారి
విలుకాఁడు చొక్కంపుటమ్ములుకులుగలదంట
రాచిల్కనెక్కెడు రాయరౌతు

తే. మీనుమొసలిసిడంబులకేమేటిచంద
మామయల్లుఁడు వలరాజు కే మరుఁడు లచ్చి
కొమరుఁ డనుపేళ్ల నొప్పను కే కుసుమధన్వి
విగతభవపాశ కాశీనికేవేశ యీశ. 14

టీ. అలరువిల్తుండు = పుష్పధనుస్సుగలవాఁడు, కన్నులవిల్తుఁడు = పర్వములు గలధనుస్సుగలవాఁడు, కమ్మవిలుకాఁడు=మధురమైన ధనువుగల వాఁడు, చక్కెరవింటివాఁడు=శర్కరధనుస్సుగలవాఁడు, చెఱకువిలుకాఁ డు=ఇక్షువు ధనువుగాఁగలవాఁడు, కెంజిగురులవిల్తుఁడు = ఎఱ్ఱనిచిగుళ్లు ధనుస్సుగాఁగలవాఁడు, వెడవిల్తుఁడు = చులుకనివిల్లుగలవాఁడు, పచ్చవిల్తుఁ డు=పచ్చనివిల్లుగలవాఁడు,, ఇంచువిల్లుదాలుపు = ఇక్షుధనుస్సును ధరించిన వాఁడు, తుంటవిలుకాఁడు=చెఱకుతుంటవిల్లుగాఁగలవాఁడు, తియ్యవిలుకాఁ డు=తియ్యని విల్లుగలవాఁడు, జమిలిముక్కాలినారివిలుకాడు = (జమిలి, ముక్కాళ్లు=రెండు మూళ్లు అనఁగా ఆఱుకాళ్లుగల), తుమ్మెదలేనారిగాఁగల ధనువుగలవాఁడు, చౌపంచములుకులుగలదంట = (చౌ-పంచ=౪+౧) పంచ బాణములుగల దిట్టరి, రాచిలుక నెక్కెడు రాయరౌతు=రాచిలుక నెక్కెడు రాజైనరౌతు, మీనుమొసలిసిడంబుల, మేటి=మత్స్యమును మకరమును ధ్వజ ముగాఁగల దిట్టరి, చందమామయల్లుఁడు=చంద్రునకల్లుఁడు, వలరాజు=కామ ములకురాజు, మరుఁడు, లచ్చికొమరుఁడు=లక్ష్మికిఁ గొమారుఁడు. ఈ ౧౫ మన్మథునిపేళ్లు.

సీ. చలువలఱేఁడు వెన్నెలఱేఁడు రేఱేఁడు
జాబిల్లి రేవెల్గు కే చందమామ
తమ్ములపగవాఁడు కే కమ్మవిల్తునిమామ
కలువలఱేఁడు పాల్కడలిపట్టి
జక్కవకవవిప్పు కేముక్కంటితలపువ్వు
చుక్కలదొర ప్రొద్దుకేజోడుకోడె

తపసికన్నాప బిత్తరిజింకతాలుపు
కలివేల్పుడాకన్ను | కడలివెన్న

తే. పంటపయిరులయొకిమీఁడు | జంటదంట
చౌకములపాళ్ల తెలిముద్ద | చలివెలుంగు
వేలుపులబువ్వ చీఁకటివేరువిత్తు
నెల యనఁగఁ జంద్రుపే ళ్లొప్పు | నీలకంఠ. 15

టీ. చలువలఱేఁడు=శీతలములకురాజు, వెన్నెలఱేఁడు = వెన్నెలకురాజు, రేఱేఁడు = రాత్రికధిపతి, జాబిల్లి = (జానుబిల్ల) ఒప్పుచున్న బింబముగలవాఁడు, రేవెల్గు=రాత్రియందు ప్రకాశించువాఁడు, చందమామ, (చంద్రమశ్శబ్దమునకు వికృతి) తమ్మిగలపగవాఁడు = పద్మములకు విరోధి, కప్పువిల్తునిమామ=మన్మథునకు మామ, కలువలఱేఁడు = కలువలకురాజు, పాలకడలిపట్టి = క్షీరసముద్రమునికొమరుఁడు, జక్కవకవవిప్పు=చక్రవాకపక్షులయొక్క జతనువిప్పువాఁడు, ముక్కంటితలపువ్వు = ఈశ్వరుని శిరసునందుండెడుపుష్పము, చుక్కలదొర=నక్షత్రములకురాజు, ప్రొద్దుజోడు, జోడె = సూర్యునకు సమానుఁడయినవాఁడు, తపసికన్నాప=అత్రిముని నేత్రమునందుఁ బుట్టినచిన్నవాఁడు, బిత్తరిజింకతాలుపు=సొగసైనలేడిని ధరించినవాఁడు, కలివేల్పుడాకన్ను=విష్ణువునకు వామనేత్రము, కడలివెన్న = సముద్రమందుఁబుట్టినవెన్న (సముద్రమును చిలికినపుడు చంద్రుఁడందుఁబుట్టెను), పంటపయిరులయొకిమీఁడు = ఫలపాకాంతమైన సస్యములకు రాజు, జంటదంటచౌకములపాళ్లతెలిముద్ద = (జంట=౨, దంట=౨, చౌకము = ౪, ౨×౨×౪=౧౬) పదియాఱుకళలుగల తెల్లనిబింబము, చలివెలుంగు = చల్లని ప్రకాశముగలవాఁడు, వేలుపులబువ్వ=దేవతల కన్నము, చీఁకటివేరువిత్తు=చీఁకటిని హరించువాఁడు, నెల - ఈ ౨౮ చంద్రుని పేళ్లు.

సీ. వెన్నునివలకన్ను | వేఁడివేలుపు ప్రొద్దు
తొవలరాయిడికాఁడు | పవలుసేయు

వేలుపు, పచ్చగుఱ్ఱాలవజీరుండు
వేఁడివెలుంగు రేవెల్గుజోడు
జంటారుమేనులసామి చీఁకటిగొంగ
యెఱ్ఱనివేలుపు నివముసూడు
చదలుమానికము ప్రాఁజదువులపెట్టియ
యేడుగుఱ్ఱముల తేరెక్కుజోదు
మువ్వేలుపులయిక్క మ్రొక్కులదేవర
గాములఱేఁడు జక్కవలఱేఁడు
వేయిచేతులఱేఁడు వెలుఁగులయెకిమీఁడు
చెయువులసాకిరి చాయమగఁడు

తే. మింటితెరువరి తమ్మివాల్గంటిమగఁడు
పోరనీల్గెడు మొనగాండ్రుపోవుదారి
జగముచుట్టంబు జమునయ్య జగముకన్ను
నాఁగ సూర్యునిపేళ్లొప్పు నాగభూష. 16

టీ. వెన్నునివలకన్ను = విష్ణువునకుదక్షిణనేత్రము, వేఁడివేలుపు=వెచ్చనిదేవుఁడు, ప్రొద్దు=(ప్ర)బ్రధ్న, తొవలరాయిడికాఁడు=కలువలకువిరోధి, పవలుసేయువేలుపు = దినమును జేయు దేవుఁడు, పచ్చగుఱ్ఱాలవజీరుండు = పచ్చనిగుఱ్ఱముల నెక్కెడివాఁడు వేఁడివెలుంగు= వెచ్చనివెలుఁగుగలవాఁడు, రేవెల్గుజోడు = చంద్రునికి జత; జంటారుమేనులసామి = పండ్రెండుశరీరములుగలదేవుఁడు, చీఁకటిగొంగ=తమస్సునుహరించువాఁడు, ఎఱ్ఱనివేలుపు = రక్తవర్ణముగలదేవుఁడు, ఇనముసూడు = హిమమునుహరించువాఁడు, చదలుమానికము = ఆకాశమునకు రత్నము, ప్రాఁజదువులపెట్టియ = వేదములకుఁ బెట్టె, ఏడుగుఱ్ఱముల తేరెక్కుజోదు =ఏడుగుఱ్ఱములుగట్టిన రథమునెక్కెడు యోధుఁడు, మువ్వేలుపులయిక్క = త్రిమూర్తులకు స్థానము, మ్రొక్కుల

దేవర = నమస్కారములకుఁ బ్రియుఁడైనదేవుఁడు, గాముల ఱేఁడు = గ్రహములకురాజు, జక్కవలరేడు = చక్రవాకపక్షులకు రాజు, వేయిచేతుల ఱేఁడు = సహస్రకరములుగలరాజు, వెలుఁగులయొకిమీఁడు = తేజస్సునకధిపతి, చెయువులసాకిరి = కర్మములకుసాక్షి, చాయమగఁడు = ఛాయాదేవికి మగఁడు, మింటితెరువరి = నభోమార్గముగలవాఁడు, తమ్మివాల్గంటిమగఁడు = పద్మినియనెడు చిన్నదానికిఁ బెనిమిటి, పోరనీల్గెడుమోసగాండ్రుపోవుదారి = యుద్ధమందుఁజచ్చు వీరులుపోయెడిమార్గము (అట్టివీరులు సూర్యమండలమును భేదించుకొనిపోవుదురు), జగముచుట్టంబు = లోకబాంధవుఁడు, జమునయ్య = యమునకుఁ దండ్రి, జగముకన్ను = జగత్తునకు నేత్రము-ఈ ౧౬ సూర్యుని పేళ్లు.

ప్ర-వి. యముఁడు=జముఁడు.

సీ. చట్టుపల్ దెగగట్లఁ | గొట్టెడుజెట్టి నూ
అంచులవాలుచే | మించుజోదు
దుగబొట్ల పిఱిఁది దైవ | ముకనుంగవలవేల్పు
పాఱుతపసియింటి | పంచకోడి
రొడలిచూపొడయఁ డె | క్కుఁడు మొగుల్గలప్రోడ
నిక్కువీనులజక్కి | నెక్కురౌతు
తెల్లయేనుఁగునెక్కి | తిరిగెడుదొర తూర్పు
మాగానియేలెడు | మనియకాఁడు
తే. జమిలిచౌవంచపదులు జ - న్నములుసేసి
నట్టివేలుపు సోమ్మాశికి పెట్టుఁజెట్టు
పుట్టితమ్ముఁడు గల్గిన | యట్టివేల్పు
నాఁగ నింద్రునిపేళ్లొప్పు | నాగభూష. 17

టి. చట్టుపల్ దెగఁగట్లఁగొట్టెడుజెట్టి = పర్వతములయొక్క ఱెక్కలను దెగఁగొట్టినదిట్ట, నూరంచులవాలుచేమించుజోదు = నూఱుమొనల

వజ్రాయుధముచేత మించినయోధుఁడు, దుగబోట్లపితేఁదియైద. కనుంగవల వేల్పు= (రెండుసున్నలువెనుకఁగలఐదు-అనఁగా ౫౦౦, దానికవ ౫౦౦+౫౦౦= ౧౦౦౦). వేయి నేత్రములు గలదేవుఁడు, పాఱుతపసియింటి పంచకోడి = బ్రహ్మర్షి యైనగౌతమునియింటిపంచ నున్నకోడి, ఒడిలిచూపొడయఁడు = శరీరముచేతఁజూచెడిరాజు, ఎక్కుడు మొగుల్ గలప్రోడ = మేఘములను వాహనములనుగా నెక్కుడట్టి, నిక్కుపీనులజక్కి నెక్కురేతు=నిక్కుచెవుల వాహనము (ఉచ్చైశ్శ్రవమనుగుఱ్ఱము) నెక్కెడిరాజు, తెల్లయేనుఁగు నెక్కెడిదొర=ఐరావత మను తెల్లయేనుఁగు నెక్కితిరుగునట్టిరాజు, తూర్పుమాగానియేలెడుమనియకాఁడు = తూర్పురాజ్యము; నేలెడియుద్యోగముగల వాఁడు, జమిలిచౌవంచపదులు జన్నములుచేసినట్టివేలుపు-జమిలి = ౨, చౌవంచ=౪+౧=౫-౨+౫+౧౦=౧౦౦) నూఱుయజ్ఞములు చేసినదేవుఁడు, సోమాసిపెట్టుఁజెట్టు=సోమయాజికిఁగల్పవృక్షమువంటివాఁడు, [సోమయాజి (వి) సోమాసి] పొట్టితమ్ముఁడు గల్గిన చుట్టివేల్పు = వామనుఁడు తమ్ముఁడుగాఁ గలదేవుఁడు-ఈ౧౨ దేవేంద్రుని పేళ్లు.

ఆ. నీరుపాప గాలి ॥ నెచ్చెలి యన్నింటి
తిండికాఁడు కప్పుఁ ॥ దెరువుజాడ
యంటరాని వేల్పు ॥ జంటమోములసామి
యగ్గి యనఁగ నొప్పు ॥ ననలుఁ డీశ. 18

టీ. నీరుపాప=ఉదకమునందుఁ బుట్టినవాఁడు, గాలినెచ్చెలి=వాయువునకు మిత్రుఁడు, అన్నింటితిండికాఁడు = సర్వమును భక్షించువాఁడు, కప్పుఁదెరువుజాడ=నల్లనిమార్గముగలవాఁడు-కృష్ణవర్త్మ, అంటరానివేల్పు = ముట్టశక్యముగానిదేవుఁడు, జంటమోములసామి = రెండుముఖములు గలదేవుఁడు, అగ్గి-ఈ ౭ అగ్నిపేళ్లు.

తే. జమునసై దోడు పెతర్గుల ॥ సామి జముఁడు
ప్రొద్దుకొమరుఁడు గుదెతాల్పు ॥ పోతుజక్కి

నెక్కి యాడెడుబలుపోతు ॥ దక్కినంపు
సామి యన నంతకుం డొప్పు ॥ శ్రీమహేశ. 19

టీ. జమునసైదోడు=యమునానదీ సహోదరుఁడు, పెతరులసామి = పితృదేవతలకు రాజు, ప్రొద్దుకొమరుఁడు = సూర్యునికుమారుఁడు, గుదెతాల్పు=గదను ధరించినవాఁడు, పోతుజక్కినెక్కి ఆడెడుబలుపోతు = మహిషవాహనము నెక్కి సంచరించు బలముగలపోతు, దక్కినంపుసామి = దక్షిణపు దిక్కునకు రాజు. ఈ 8 యముని పేళ్లు

ప్ర- వి. గద = గుదె-గుదియ, పితృ = పెతరులు, యమున = జమున, స్వామి = సామి, కుమారుఁడు=కొమరుఁడు, దక్షిణము=దక్కినము.

ఆ. మూలఱేఁడు సోఁకుమ్మూఁకలఱేఁడు రే
ద్రిమ్మరీఁడు లసు ॥ దిండిపోతు
రక్కసుండు నల్ల ॥ ద్రావువాఁ డనఁగను
నిర్ృతిపేళ్లు పెల్లు ॥ నీలకంఠ. 20

టీ. మూల ఱేఁడు=రాత్రియందుం దెడ్మరాజు, సోఁకుమూఁకల ఱేఁడు= రాక్షసులకధిపతి, రేద్రిమ్మరీఁడు=రాత్రియందు సంచరించువాఁడు, పొలసు దిండిపోతు=మాంసభక్షించువాఁడు-పలాశి, రక్కసుఁడు (ప్ర. రాక్షసుఁడు), నల్లద్రావువాఁడు=రక్తమును పానము సేయువాఁడు - ఈ 6 నిర్ృతి పేళ్లు.

ఆ. మేటినీరుచూలి ॥ మెయితాలుపులసామి
వల్లెత్రాడు తాల్పు ॥ నిల్ల రాయఁ
డేటిబోటివిభుఁ డీ ॥ యెకిమీఁడు పడమటి
దొర యనంగ నొప్పు ॥ వరుణుఁ డీశ. 21

టీ. మేటినీరు చూలి మెయి తాలుపులసామి = మిక్కిలిజలముగల సముద్రమునందు పుట్టిన దేహములు ధరించినవారికి (జలజంతువులకు) రాజు

వల్లెత్రాడుదాల్పు=పాశమునుధరించినవాఁడు, నీళ్లరాయఁడు=ఉదకములకధిపతి, ఏటి బోటి మగల ఎకిమీఁడు-నదీ కాంతలకు భర్తలయిన సముద్రములకురాజు, పడమటిదొర=పశ్చిమదిక్కునకు రాజు-ఈ ౫ వరుణుని పేళ్లు.

సీ. వడిగల జింకతత్తడి నెక్కునెఱరౌతు
మేటిపాముల మేఁత నీటితాత
యొడలితాల్పులపిండు కుసు అగుబలియుండు
సోఁకుడయ్యము మింటి చూల్గి గాలి
కరువలి తెమ్మెర కాడ్పు ప్లయ్యర యొంటి
మ్రాకుఁలవెనుముప్పు మబ్బువిప్పు
సురఁటివిప్పులఁబుట్టు సుడిగొట్టు చలినట్టు
బక్కవారలవెను బాద యీఁద

తే. యబ్బురపుఁదియ్యవిలుకాని నిబ్బరంపు
దెబ్బపోరుల నలయిన ప్రబ్బుబోట్ల
గబ్బి గుబ్బల చెమటల యుబ్బడంచు
గబ్బి నాఁ జను మారుతాఖ్యలు నృపాంక. 22

క. మరుదాఖ్య లొప్పుచుండును
ధర వినుచూలి యన సోఁకు డయ్య మనంబ
య్యర యన గొట్టన సీఁ డనఁ
గరువలి యనఁ దెమ్మెరనఁగ గాలి యనంగన్. 23

టీ. వడిగలజింకతత్తడి నెక్కునెఱరౌతు=వేగముగల లేడిని వాహనముగానెక్కు అధికుఁడయినరౌతు, మేటిపాములమేఁత = గొప్పసర్పములకాహారము, నీటితాత=ఉదకములకు పితామహుఁడు, ఒడలితాల్పులపిండుకు ఉసుఱు అగుబలియుండు = దేహధారుల సమూహమునకుఁ బ్రాణమైన బలవంతుఁడు, సోఁకుడయ్యము=కనఁబడక స్పృశించునట్టి (లేక, స్పర్శ

గుణముగల) దైవము, మింటిచూలి=ఆకాశమందుఁ బుట్టువాఁడు, గాలి, కరువలి, తెమ్మెర, గాడ్పు, పయ్యర, ఒంటిమ్రాఁకుల పెనుముప్పు = ఒంటిగానున్న వృక్షములకు మిక్కిలిహానిచేయువాఁడు, మబ్బువిప్పు=మేఘములను చెల్లాచెదరుచేయువాఁడు, సురఁటివీవులఁబుట్టు=చామరములు వీచుటవలనఁ బుట్టువాఁడు, సుడిగొట్టు=సుడిసి (గుండ్రముగా) కొట్టువాఁడు, చలిపట్టు=చలికి స్థానమైనవాఁడు, బక్కవారల పెనుబాద=చిక్కినవారిని మిక్కిలిబాధ సేయువాఁడు, ఈఁద, అబ్బురపు...గబ్బి=అబ్బురపు = ఆశ్చర్యకరమైన, తియ్యవిలుకాని=మన్మథునియొక్క, నిబ్బరంపుదెబ్బపోరుల=మిక్కుటమైన దెబ్బలుగల యుద్ధములయందు (అనఁగా రతిక్రీడలందు), అలయికప్రబ్బు=మిక్కిలి యలసటఁజెందునట్టి, బోట్ల=స్త్రీలయొక్క, గబ్బి=గొప్పలైన, గుబ్బల=స్తనములయందలి, చెమటల=చెమటలయొక్క, ఊబ్బు=అతిశయము, అడంచు=అడఁచునట్టి, గబ్బి=గొప్పవాఁడు, వినుచూలి = ఆకాశమునందుఁ బుట్టినవాఁడు, (సోఁకుడయ్యము, పయ్యర, గొట్టు, ఈఁద, కరువలి తెమ్మెర, గాలి) - ఈ ౨౨ వాయువుపేళ్లు.

క. ముక్కంటియనుఁగుఁజెలి వడ
చక్కెలిక చాగకాఁడు జక్కులదొర బల్
రొక్కమ్మెకిమీఁడు తత్తడి
నెక్కెడువాఁ డనఁగ జనుధనేశుం డభవా. 24

టీ. ముక్కంటి అనుఁగు చెలి=ఈశ్వరునకు అత్యంత స్నేహితుఁడు, వడ చక్కియేలిక = ఉత్తరపుదిక్కును ఏలెడివాఁడు, చాగకాఁడు॥పా॥ తేగకాఁడు=త్యాగముగలవాఁడు, జక్కులదొర=యక్షులకు రాజు, బల్రొక్కమ్ముమెకిమీఁడు=అధికధనమునకు అధిపతి, తత్తడిని ఎక్కెడువాఁడు=అశ్వము ఎక్కునట్టివాఁడు (॥పా॥ మానిసినెక్కెడువాఁడు = మనుష్యు నెక్కునట్టివాఁడు - నరవాహనుఁడు) - ఈ ౭ కుబేరునిపేళ్ళు.

క. విడిముడిగలవేలుపుచెలి
జడముడిజంగంబు గడదె ॥ సం గాపరి యా
యొడయండు పాఁపతొడవుల
నిడియెడివే ల్పనఁగ నొప్పు ॥ నీశానుఁ డిలన్. 25

టీ. విడిముడిగల వేలుపు చెలి = ధనముగల దేవతకు (కుబేరునకు) స్నేహితుఁడు, జడముడిజంగంబు=జడముళ్ళుగల జంగము, కడదెసన్ కాపరి యొడయండు=కడపటిదిక్కునకు పాలకుఁడు అగు రాజు, పాఁపతొడవులన్ ఇడియెడివేల్పు = పాములను భూషణములనుగా ధరించినదేవుఁడు - సర్వభూషణుఁడు - ఈ ౪ ఈశానుని పేళ్లు.

క. దేవాలయాహ్వయంబులు
కోవెల యన దేవళంబు ॥ గుడి నా నెలయున్ ;
దేవళ్లన జేజే లనఁ
గా వేలుపు లనఁగ వెలయు ॥ గ్రతుభుగభిఖ్యల్. 26

టీ. కోవెల-దేవళంబు, (ప్ర. దేవాలయము), గుడి-ఈ౩ దేవాలయము పేళ్లు. దేవళ్లు (ఏకవచనము-దేవర), జేజేలు, వేలుపులు - ఈ ౩ దేవతల పేళ్లు.

ఆ. క్షితిని బెల్లు దనరు ॥ సిరిదంపుఁబెద్ద బల్
పాఁపఱేఁడు వెన్ను ॥ పాను పనఁగఁ
బుడమితాలు పనఁగఁ ॥ దడవులనిడుపుఁడు
చిలువఱేఁ డనంగ ॥ శేషునకును. 27

టీ. సిరిదంపు పెద్ద=కుబుసముగల పెద్ద,బల్పాఁపఱేఁడు = గొప్పసర్ప రాజు, వెన్నుపానుపు=విష్ణువునకు పఱుపు, పుడమితాలుపు = భూమిని ధరిం

బినవాఁడు, ఆడవులనిడుపఁడు=చిరకాల ముండువాఁడు, చిలువల కోఁడు=పాములకురాజు - ఈ ౬ శేషుని పేళ్లు.

క. మరునయ్య తేజి పులుఁగుల
దొర పాముల వేఁటకాఁడు తూరుపు నాఁడేల్
దొరబువ్వఁ గొన్నలావరి
గరుటామంతుఁ డన నొప్పు గరుడుం డభవా. 28

టీ. మరునయ్య తేజి=మన్మథుని తండ్రియగు విష్ణువునకు వాహనము. పులుఁగులదొర=పక్షులకురాజు, పాముల వేఁటకాఁడు = సర్పములనుసంహరించువాఁడు, తూరుపునాఁడు ఏలు దొర బువ్వఁ గొన్నలావరి=పూర్వదిక్కును పాలించు అధిపతి యగు ఇంద్రునకు అన్నమైన అమృతమును లాగుకొన్న బలవంతుఁడు, గరుటామంతుఁడు (ప్ర. గరుత్మంతుఁడు) = అధికబలముగల ఱెక్కలు గలవాఁడు - ఈ ౫ గరుత్మంతుని పేళ్లు.

ఆ. నల్లవలువదాల్పు తెల్లనిమెయిదంట
వెన్నదొంగయన్న వెజ్జిసీళ్ల
మేలువాఁడు దుక్కివాలుదాలుపు తాటి
పడగవాఁ డనంగ బలుఁడు రుద్ర. 29

టీ. నల్లవలువదాల్పు = నల్లనివస్త్రమును ధరించినవాఁడు, తెల్లనిమెయిదంట=తెల్లనిశరీరముగలదిట్ట, వెన్నదొంగయన్న =కృష్ణునకు అన్న, వెజ్జిసీళ్ల మేలువాఁడు=సురకుఁ బ్రియుఁడైనవాఁడు, దుక్కివాలుదాలుపు = నాఁగేలు ఆయుధముగా ధరించినవాఁడు, తాటిపడగవాఁడు = తాళధ్వజముగల వాఁడు ఈ ౬ బలరాముని పేళ్లు.

క. కడిముడి యనఁగ్గా గాడుపు
కొడు కన నివి రెండుఁ బేళ్లు గున్ భీమునకుం;

బుడమిం గఱ్ఱి యనం గ
వ్వడి యన విప్పచ్చుఁ డనగ ♫ వాసవి యాఖ్యా. 30

టీ. నడముడి, గాడుపుకొడుకు = వాయుపుత్రుఁడు-ఈ 2 భీమునకుఁ పేళ్లు. కఱ్ఱి, కవ్వడి (కనవడి=రెండుచేతులను బాణప్రయోగము చేయువాఁడు) విప్పచ్చుఁడు (బీభత్సశబ్దవికృతి) - ఈ 3 అర్జునుని పేళ్లు.

తే. వేలుపులత్రోవ యుప్పర ♫ వీది యాక
సంబు విను విన్ను మిను మిన్ను ♫ చదలు నింగి
'దివి మొయిలుదారి చుక్కల ♫ తెరువుబయలు
గాడ్పుతంఁడన నభ మొప్పు ♫ గరళకంఠ. 31

టీ. వేలుపులత్రోవ=దేవతలకుమార్గము, ఉప్పరవీది = పైనుండెడివీధి, ఆకసంబు (ప్ర. ఆకాశము) విను, విన్ను, మిను, మిన్ను, చదలు, నింగి దివి (దుశ్శబ్దవికృతి. ఇది తత్సమమని బాలవ్యాకరణము) మొయిలుదారి = మేఘములకుమార్గము, చుక్కలతెరువు = నక్షత్రములకు మార్గము, బయలు, గాడ్పుతండ్రి=వాయువునకుఁ తండ్రి-ఈ 16 ఆకాశమునకుఁ పేళ్లు.

తే. వెలయు ధరణిఁ జతుర్దిశల్ ♫ నలుగడ లన
నలరు దచ్చికడ లన ది ♫ గష్టకంబు
దనరు నీరైదుకడలు నా ♫ దశదిశలును
మాళిధృతగంగ యంగజ ♫ మదవిభంగ. 32

టీ. నలుగడలు = నాలుగుదిక్కులు, దచ్చికడలు = ఎనిమిది దిక్కులు, ఈరు ఐదు (రెండుఐదుల) కడలు=పది దిక్కులు.

ఆ. తాటిసిడమువాని ♫ తల్లి కూఁతురిబిడ్డ
వెన్నునడుగు పాప ♫ మిన్నువాఁక
వేల్పుటేఱు కడలి ♫ వెలఁదుక ముత్రోవ
ద్రిమ్మరనఁగ నొప్పు ♫ దివిజగంగ. 33

టీ. తాటిసిడమువానితల్లి=తాలధ్వజుఁడగు భీష్మునకుఁ దల్లి, కూతురిబిడ్డ=తనకూతురైన లక్ష్మికిఁ గూఁతురు, వెన్నునడుగుపాప = విష్ణుపాదమునందుఁబుట్టినచిన్నది, మిన్నుటేఁక=ఆకాశమందుండునది, వేల్పుటేఱు = దేవతలయొక్క నది, కడలివెలఁదుక=సముద్రునకుభార్య, ముత్రోవద్రిమ్మరి=మూఁడుమార్గముల దిరుగునది-త్రిపథగ ఈ 8 ఆకాశగంగకుఁ బేళ్లు.

తే. వేలుపులగారు. చౌదంతి ౹ వెల్లయేనుఁ
గనఁగ నైరావతంబును ౹ కాఖ్య లమరు,
వేల్పుదొరతేజి యనఁగను ౹ వెల్లగుఱ్ఱ
మనఁగ నుచ్చైశ్శ్రవం బొప్పు ౹ నంబికేశ. 34

టీ. వేలుపులగారు=దేవతలయొక్కగజము, చౌదంతి=నాలుగు దంతములుగలది, వెల్లయేనుఁగు=తెల్లయేనుఁగు, ఈ 3 ను దేవేంద్రునియేనుఁగగు ఐరావతమునకు పేళ్లు. వేల్పుదొరతేజి = ఇంద్రునియొక్కగుఱ్ఱము, వెల్లగుఱ్ఱము=తెల్లగుఱ్ఱము-ఈ 2 దేవేంద్రుని గుఱ్ఱమగు ఉచ్చైశ్శ్రవము పేళ్లు.

ఆ. పుడుకుఁదోడుకు వేలు ౹ పులగిడ్డి వెలిమొద
వనఁగఁ గామధేను ౹ వలరుచుండుఁ;
గల్పకంబు దనరు ౹ వేల్పుఁ జెట్టీవుల
మ్రాను వెల్లమ్రాను ౹ నానుమేశ. 35

టీ. పుడుకుఁదోడుకు=అభీష్టములనిచ్చెడి యావు, వేలుపులగిడ్డి=దేవతలయొక్క యావు, వెలిమొదవు = తెల్లనియావు-ఈ 3 కామధేనువు పేళ్లు. వేల్పుచెట్టు=దేవతలయొక్క వృక్షము, ఈవులమ్రాను=అభీష్టముల నిచ్చువృక్షము, వెల్లమ్రాను=తెల్లనివృక్షము - ఈ 3 కల్పవృక్షమునకుఁ బేళ్లు.

ఆ. అవని గుడుసుకైదు ౹ వనఁగఁ వేయంచుల
కైదు వనఁగఁ జుట్టుఁ ౹ గైదు వనఁగ

బటువుఁగైదువ వనఁగఁ బరఁగు సుదర్శన
చక్రమునకుఁ బేళ్లు । చంద్రమౌళి. 36

టీ. గుదుసుకైదువు = గుండ్రని ఆయుధము, వేయంచులకైదువు = వేయిమొనలుగల ఆయుధము, చుట్టుకైదువు=వలయాకృతిగల ఆయుధము, బటువుకైదువు=గుండ్రని ఆయుధము. ఈ ౪ విష్ణుచక్రమునకుఁ బేళ్లు.

ఆ. వలమురి యనఁ జుట్టు । వాలుజోఁ డనఁ గల్మి
కొమ్మమగనిబూర । గొమ్మనంగఁ
దనరుఁ బాంచజన్య । మునకు నభిఖ్యలు
ధృతతురంగ ధవళ । వృషతురంగ. 37

టీ. వలమురి=దక్షిణముగాఁదిరిగినది, చుట్టువాలుజోఁడు=సుదర్శనచక్రమునకు జత, కల్మికొమ్మ మగని బూరగొమ్మ=లక్ష్మీకాంత భర్తయగు విష్ణుని పూరించు వాద్యవిశేషము, ఈ 3 విష్ణుశంఖమునకుఁ బేళ్లు.

తే. రిక్క లనఁ జుక్క లనఁగను । ఋక్షములకు
నాఖ్యలై యొప్పుఁ దెఱగంటి । యన్ను లనఁగ
నచ్చర లనంగ వేలుపు । మచ్చెకంటు
లనఁగ సురకాంతలకు నాఖ్య । లగు గిరీశ. 38

టీ. రిక్కలు (ఋక్షశబ్దమునకు వికృతి), చుక్కలు ఈ ౨ నక్షత్రములకుఁబేళ్లు. తెఱగంటియన్నులు=ఱెప్పపాట్లు లేని (అనిమిష) స్త్రీలు, అచ్చరలు (ప్ర. అప్సరసలు), వేలుపు మచ్చెకంటులు-ఈ 3 దేవకాంతలకుఁ బేళ్లు.

తే. పవలు పగ లనఁ బే ళ్లొప్పు । దివమునకును
రాత్రిపే ళ్లొప్పు రే రేయి । రాతి రనఁగ
వెలయు చుండును రేయెండ । వెన్నెలనఁగఁ
జంద్రికకును సమాఖ్యలు । చంద్రమౌళి. 39

టీ. పవలు, పగలు-ఈ ౨ పగటిపేళ్లు, రే, రేయి, రాతిరి - ఈ 3 రాత్రిపేళ్లు. రేయెండ, వెన్నెల - ఈ ౨ చంద్రికపేళ్లు.

క. మించులన మెఱుపు లనఁగను
జంచలలకుఁ బేళ్లు దనరు ॥ జన మంభోభృ
త్సంచయములఁ బల్కెదను మొయి
ళ్లంచు మొగు ళ్లంచు మబ్బు ॥ లంచున్ భర్గా. 40

టీ. మించులు, మెఱుపులు - ఈ 2 మెఱుపులకుఁ బేళ్లు. మొయిళ్లు, మొగుళ్లు, మబ్బులు - ఈ 3 మేఘములకుఁ బేళ్లు.

క. తొలుచదువులు ప్రాఁజదువులు
తొలుమినుకులు ప్రామినుకులు ॥ తొలుపలుకులు ప్రాఁ
బలుకులు పెనుమినుకులు నా
వెలయుఁ శ్రుతులకును బేళ్లు ॥ విశ్వాధిపతీ. 41

టీ. తొలుచదువులు, ప్రాఁజదువులు, తొలుమినుకులు, ప్రామినుకులు, తొలుపలుకులు, ప్రాఁబలుకులు (ఈ 6 పదములకును మొదటివిద్యలని యర్థము), పెనుమినుకులు, ॥పా॥ పెనుఁబలుకులు = విస్తారమయిన వాక్యములు - ఈ 7 వేదముల పేళ్లు

క. ఇది దేవవర్గ దీనిం
జదివిన వ్రాసినను వినిన ॥ జనులకు నిత్యా
భ్యుదయంబు లొసఁగు చుండును
వదలక కాశీనివాస ॥ వాసుఁడు పేర్మిన్. 42

దేవవర్గ సమాప్తము.

---

మానవవర్గ.

తే. పాఱుఁ డనఁగ బుడమివేల్పు ॥ బాఁపఁ డనఁగ
జన్నిగట్టన విప్రుండు ॥ జగతిఁ బరఁగు

నొడయఁ డేలిక యెకిమీఁడు పుడమిఱేఁడు
ఱేఁడు దొర సామి యన నొప్పు నృపతి పేళ్లు. 1

టీ. పాఱుఁడు, పుడమివేల్పు = భూమ్యాదేవుఁడు, బాఁపఁడు, జన్నిగట్టు=యజ్ఞోపవీతమును ధరించినవాఁడు - ఈ ౪ బ్రాహ్మణుని పేళ్లు. ఒడయఁడు. ఏలిక, ఎకిమీఁడు, పుడమిఱేఁడు=భూమి కధిపతి, ఱేఁడు-దొర, సామి (ప్ర-స్వామి), ఈ ౭ రాజు పేళ్లు.

సీ. కోమట్లు మూఁడవ కొలమువాండ్రన బేరు
లన వైశ్యనామముల్ దనరుఁ గాఁపు
వాండ్రు నా నాలవవాండ్రు నా బలిజెవాం
డ్రనఁ జను శూద్రసమాహ్వయములుఁ
వడుగునా గోఁచిబాఁపఁడు నాఁగ బ్రహ్మచా
రికిఁ బేళ్లు నడచు ధరిత్రియందు
నాలుబిడ్డలు గలయతఁ డిలుఱేఁడు గే
సన నొప్పుఁ బేళ్లు గృహాధిపతికి

ఆ. నడవిమనికిపట్టు జడదారి యన వన
వాసి యొప్పు నిల్లువాసితిరుగు
బోడ తపసి కావిపుట్టగోఁచులసామి
యన యతీంద్రుఁ డలరు నలికనేత్ర. 2

టీ. కోమట్లు, మూఁడవకొలమువాండ్రు, బేరులు ఈ 3 వైశ్య నామములు, కాఁపువాండ్రు, నాలవవాండ్రు - బలిజెవాండ్రు - ఈ 3 శూద్రుని పేళ్లు. వడుగు, గోఁచిబాఁపఁడు=కౌపీనముగల బ్రాహ్మణుఁడు-ఈ ౩ బ్రహ్మచారికిఁ బేళ్లు. ఆలుబిడ్డలు గలయతఁడు = దారాపత్యములు గల వాఁడు, ఇలుఱేఁడు=గృహాధిపతి, గేస్తు (ప్ర. గృహస్థు) ఈ 3 గృహస్థుని పేళ్లు. - అడవిమనికిపట్టు = అరణ్యము నివాసస్థానముగాఁ గలవాఁడు, జడదారి = జడలను ధరించినవాఁడు - వా. ౩ వానప్రస్థుని పేళ్లు. ఇల్లు! వాసి

తిరుగు= ఇల్లువిడిచి తిరుగువాఁడు, బోడ, తపసి, కావిపుట్టగోచులసామి= కాషాయకౌపీనములు గలవాఁడు ఈ ౪ సన్న్యాసిపేళ్లు.

సీ. అమ్మనాఁ దల్లినా నవ్వనాఁ గన్నది
    యన మాతృకాఖ్యలౌ నభ్రకేశ
యబ్బ నాయన యయ్య యనఁ దండ్రి యన నప్ప
    యన జనకాఖ్యలౌ ననగనివేశ
తోడఁబుట్టనఁగ సైదోడు తోఁబుట్టన
    సోదరాహ్వయము లౌ నాదిదేవ
భర్తృసహోదరుభార్యకుఁ దోడికో
    డ లన నేరా లన సలరు సభవ

తే. చెలియ లనఁ జెల్లె లనఁగను వెలయు చుండు
నాహ్వయములు కనిష్ఠకన్యకు గిరీశ
జ్యేష్ఠకన్యకు నాఖ్యలై క్షితిని వెలయు
నప్ప యన నక్క యనఁగఁ జంద్రాగ్రమకుట. 3

టీ. అమ్మ (ప్ర. అంబ). తల్లి, అవ్వ, కన్నది - ఈ ౪ మాతృనామములు. అబ్బ, నాయన, అయ్య (ప్ర. ఆర్య), తండ్రి, అప్ప - ఈ ౫ పితృనామములు. తోడఁబుట్టు, ॥పా॥ తోడఁబుట్టుగు - తోడఁబుట్టువు, సైదోడు, తోఁబుట్టు ॥పా॥ తోఁబుట్టువు - ఈ ౩ సోదరునామంబులు. తోడికోడలు=తనతో సమానురాలైనకోడలు, ఏరాలు - ఈ ౨ పెనిమిటితోఁ బుట్టినవాని భార్యకుఁ బేళ్లు. చెలియలు, చెల్లెలు - ఈ ౨ కనిష్ఠకన్యకుఁ బేళ్లు. అప్ప, అక్క - ఈ ౨ జ్యేష్ఠకన్యకుఁ బేళ్లు.

సీ. మగ్గకుఁ బేళ్లగు ముగుద యనఁగ ముద్ద
    రాలు నా గోల నా బేల యనఁగ
గట్టివాయి యనంగ గయ్యాళి యన జాఁగ
    యన ధూర్తసతికి నాహ్వయము లమరు.

టీ. వెచ్చకాఁడు=ధనవ్యయము చేయువాఁడు, బోజుఁగు (ప్రభుజంగుఁడు), వేడుకకాఁడు = విలాసముగలవాఁడు, మిండఁడు, నవ్వుకాఁడు= మృదువైనవాఁడు, మిండగీఁడు, లంజెకాఁడు= లంజెగలవాఁడు = ఈ 8 విటుని పేళ్లు.

ఆ. కోడెకాఁ డనంగ గోవాళ్లు నాఁగను
యువజనాఖ్య లొప్పుచుండు రెండు
నాగవాస మనఁగ నామ మౌ వేశ్యాజ
నంబు మేళమునకు నంబికేశ. 8

టీ. కోడెకాఁడు=యౌవనముగలవాఁడు, గోవాళ్లు (గోవ+వారలు- ఇది నిత్యబహువచనాంతము.)- ఈ 2 యౌవనవంతుని పేళ్లు. నాగవాసము = వేశ్యాజనముల మేళము.

సీ. నెలఁతుక క్రాల్గంటి పొలఁతుక ముద్దియ
వాలుఁగంటి మగువ పడఁతి మడఁతి
చెలి మచ్చెకంటి యుగ్మలి యింతి తొయ్యలి
నవలా కలుకకంటి నాతి గోతి
ప్రాఁబోఁడి చిగురాకుబోఁడి పైదలి మించుఁ
బోఁడి ముద్దులగుమ్మ పొలఁతి కొమ్మ
ప్రోయాలు విద తీఁగెఁబోఁడి చేడియ యించుఁ
బోఁడి యన్ను వెలంది బోటి జోటి

తే. చాన తెఱవ వెలందుక చామ లేమ
చెలువ యెలనాఁగ చిలుకలకొలికి కలికి
తలిరుఁబోఁడి యలరుఁబోఁడి నెలఁత పొల్తి
గరిత యతివ నా స్త్రీసమాఖ్యలు మహేశ. 9

టీ. నెలఁతుక, క్రాల్గంటి=చంచలములగు నేత్రములుగలది, పొలఁతుక

ముద్దియ, వాలుఁగంటి=విశాలనేత్రములుగలది, మగువ, పడఁతి, ॥పా॥ పణఁతి, పడఁతి, చెలి, మచ్చెకంటి=మత్స్యములవంటి నేత్రములుగలది, ఉగ్మలి, ఇంతి, నవలా, కలువకంటి = కలువలవంటి నేత్రములుగలది, నాతి, గోతి, పూఁబోఁడి=పుష్పమువలె మృదువైనశరీరము గలది, చిగురాకుఁబోఁడి=చిగురుటాకువలె మృదువైనదేహముగలది. పైదలి, మించుఁబోఁడి=మెఱుపువలెఁ బ్రకాశించు దేహముగలది, ముద్దులగుమ్మ = మురిపెములనిచ్చునది, పొలఁతి, కొమ్మ, ప్రోయాలు, ఉవిద, తీఁగెఁబోఁడి=తీగవలె మనోజ్ఞమైన మేనుగలది, చేడియ, ఇంచుఁబోఁడి=చెఱకువలె ప్రియమైన మేనుగలది, అన్ను, వెలఁది, బోటి, జోటి, చాన, తెఱవ, వెలఁదుక, చామ, లేమ, కొలువ, ఎలనాఁగ, చిలుకలకొలికి=చిలుకలవంటి కన్నులకొలుకులు గలది, కలికి, చిగురుఁబోఁడి = చిగురువలె మృదువైన మేనుగలది, అలరుఁబోఁడి = పుష్పమువలె మృదువైన మేనుగలది, నెలఁత, పాత్రి, గరిత, అతివ-ఈ ౮౭ స్త్రీకిఁ బేళ్లు.

తే. చెలిమి నేస్తంబు పొందు నా స్నేహ మలరు
నెచ్చెలియనుంగు సంగాతి నేస్తకాఁడు
సంగడీఁ డనఁ జెలికాఁ డనంగఁ దనరు
స్నేహితునకు సమాఖ్యలు శ్రీమహేశ. 10

టీ. చెలిమి, నేస్తంబు, పొందు-ఈ 3 స్నేహమునకుఁ బేళ్లు. నెచ్చెలి అనుంగు, సంగాతి, నేస్తకాఁడు, సంగడీఁడు చెలికాఁడు=ఈ౬ స్నేహితునకుఁ బేళ్లు.

సీ. దొంగ తెక్కలికాఁడు దొరకోలుసన్యాసి
ముచ్చు తుంబరికాఁడు ముడియవిడుపు
తెరువాటుకాఁడు కత్తెరదొంగ చేవాఁడి
కాఁడు వల్లడికాఁడు కన్నగాఁడు
మొనిముచ్చు గళ్లదొంగ యనఁ దస్కరాఖ్యలౌఁ
జెండిపోతు గరాసు మొండికెటు

టకటొంకు టాటోటు టక్కులాఁడు పిసాళి
టక్కరి ముడికాఁడు తవళికాఁడు

తే. కల్లరియు గొంటు కైలాటకాఁడు చెడుగు
బేరజము కుచ్ఛితుఁడు దోసకారి చెనఁటి
పాలసుఁడు నాలిబూతంబు పలువ తులువ
కూళ గడుసు సన వర్తిల్లుఁ గుజను పేళ్లు. 11

టీ. దొంగ, తెక్కలికాఁడు=బందిపోటు వేయువాఁడు, దొరకోలు సన్యాసి = వేషమువేసి నమ్మించి వెనుక సొమ్ము నెత్తుకొని పోవువాఁడు, ముచ్చు, ఎత్తుబరికాఁడు, ముడియవిడుపు = సొమ్ముముడివిప్పువాఁడు, తెరువాటుకాఁడు=దారి కట్టి కొట్టి దోఁచుకొనువాఁడు, కత్తెరదొంగ=నగలు కత్తిరించుకొనువాఁడు, చేవాఁడికాఁడు=చేతిబలముగలవాఁడు, పల్లడికాఁడు=కొల్ల పెట్టువాఁడు. కన్నగాఁడు=కన్నము వేయువాఁడు, మునిముచ్చు = మునివలెఁ దపసివేషము వేసి యేమఱించువాఁడు, గడిదొంగ = ఒళ్లెఱిఁగిన దొంగ - ఈ. ౧౩ దొంగకుఁ బేళ్లు. చెంచెపోతు = మందబుద్ధిగలవాఁడు, గరాసు, మొండికట్టె=మొరకితనముఁ జేయువాఁడు, టకటొంకు, టాటోటు, టక్కులాఁడు=అబద్ధములాడువాఁడు, పిసాళి, టక్కరి, ముడికాఁడు, తవళికాఁడు=కపటముగలవాఁడు, కల్లరి=అబద్ధము లాడువాఁడు, గొంటు, కైలాటకాఁడు = మాయోపాయము గలవాఁడు. చెడుగు, బేరజము, కుచ్ఛితుఁడు (ప్ర. కుత్సితుఁడు), దోసకారి, చెనఁటి, పాలసుఁడు నాలిబూతము, పలువ, తులువ, కూళ, గడుసు - ఈ ౨౪ కుత్సితుని పేళ్లు.

ఆ. పాప బుడుత చిఱుత పట్టి సిసువు కందు
కూన నిసువు బిడ్డ కుఱ్ఱ బొటె
యనఁగ శిశుసమాఖ్య లగుఁ గొమరుండు నాఁ
గొడుకు నాఁ గుమారకుండు వెలయు. 12

టీ. పాప, బుడుత, చిఱుత, పట్టి, సిసువు, (ప్ర. శిశువు), కందు, కూన, నిసువు, బిడ్డ, కుఱ్ఱ, బొట్టె-ఈ ౧౧ శిశువుపేళ్లు. కొమరుఁడు. (ప్ర. కుమారుడు), కొడుకు - ఈ ౩ కుమారునిపేళ్లు.

ఆ. వటుసమాఖ్య లగును ♦ వసుధలోఁ గొండిక
వాఁ డనంగఁ బడుచువాఁ డనంగఁ
బిన్నవాఁ డనంగఁ ♦ జిన్నవాఁ డనఁగను
వినుతగుణసనాథ ♦ విశ్వనాథ.  13

టీ. కొండికవాఁడు. ॥సూ॥ కొండొకవాఁడు, పడుచువాఁడు, పిన్నవాఁడు. చిన్నవాఁడు - ఈ ౪ బాలునకుఁ బేళ్లు.

సీ. గిటక పొట్టి కుఱుచ ♦ గిట్ట గు జ్జనఁగ వా
మనుఁ డొప్పుఁ జను నపస్మారిపేళ్లు
వెడఁగు వేదుఱు వెట్టి ♦ పీటిఁడి వేటిఁడి
వెంగలి వెంబర ♦ విత్తనంగఁ
జతురునకును బేళ్లు ♦ జాణ దంట వలంతి
వెరవరి ప్రోడ నే ♦ ర్పరి యనంగఁ
బ్రన్ననివాఁడు రూపరి చక్కఁడఁగలవాఁడు
చక్కనివాఁడు నా ♦ జగతిఁ బరఁగు
తే. సుందరాకారవంతుఁడు ♦ సొగసుకాఁడు
వన్నెకాఁ డన శృంగారి ♦ వసుధ వెలయు
నంధకునిపేళ్లు చీకు గ్రు ♦ డ్డనఁగ మూఁగ
మూవ యన మూఁకనామముల్ ♦ దేవదేవ.  14

టీ. గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట, గుజ్జు - ఈ ౫ వామనుని పేళ్లు. వెడఁగు, వేదుఱు, వెట్టి, పీటిఁడి, వేటిఁడి, వెంగలి, వెంబరవిత్తు - ఈ ౭ అపస్మారిపేళ్లు. జాణ,. దంట, వలంతి, వెరవరి, ప్రోడ, నేర్పరి - ఈ ౬

చతురునకుఁ బేళ్లు. ప్రన్నగివాఁడు=సుందరుఁడు, రూపరి=రూపవంతుఁడు, చూడఁగలవాఁడు, చక్కనివాఁడు=చక్కనైనవాఁడు-ఈ ౪ సౌందర్యము గలవాని పేళ్లు. సొగసుకాఁడు = సొగసైనవాఁడు, సన్నెకాఁడు=కాంతిగల వాఁడు - ఈ ౨ శృంగారవంతుని పేళ్లు. చీకు, గ్రుడ్డి - ఈ ౨ అంధకుని పేళ్లు. మూఁగ - మూప - ఈ ౨ మూగవానికి నామములు.

క. కాయము పేళ్లయి వెలయును
మే యన నొడ లనఁగ మేను । మెయి యన, భోగ్య
ప్రాయము పేళ్లగుఁ బరువము
పాయము జవ్వన మనంగ । భావజదమనా. 15

టీ. మే, ఒడలు, మేను, మెయి - ఈ ౪ శరీరము పేళ్లు. పరువము, పాయము, జవ్వనము (ప్ర. యౌవనము) - ఈ 3 యౌవనము పేళ్లు.

తే. నెఱులు కురులు వెండ్రుకలు నా । నెఱిక లనఁగఁ
గొప్పు తుఱుము మన వేనలి । క్రొవ్వెద యనఁ
గేశధమ్మిల్లములు మించుఁ । గీలుగంటు
క్రొమ్ముడి యనంగఁ గేశబంధ మ్మగు భవ. 16

టీ. నెఱులు, కురులు, వెండ్రుకలు. నెఱికలు. ఈ ౪ కేశములకు పేళ్లు. కొప్పు, తుఱుము, వేనలి, క్రొవ్వెద (క్రొత్త + వెద) - ఈ ౪ ధమ్మిల్లమునకు పేళ్లు. కీలుగంటు, క్రొమ్ముడి (క్రొత్త + ముడి) - ఈ ౨ కేశబంధము (అనఁగా వెండ్రుకలముడి) పేళ్లు.

తే. నొసలు నెన్నొసల్ నుదురు నెన్నుదు రనంగఁ
దనరు ఫాలంబు చూడ్కి చూ । పనఁగ నొప్పు
నాహ్వయము లీక్షణమునకు । నక్షి కాఖ్య
లలరుఁ గన్ గను కన్ను నా । నభ్రకేశ. 17

టీ. నొసలు, నెన్నొసలు (నెఱి + నొసలు), నుదురు. నెన్నుదురు (నెఱి + నుదురు) ఈ ౪ ఫాలము పేళ్లు. చూడ్కి, చూపు - ఈ ౨ ఈక్షణమునకుఁ బేళ్లు. కన్, కను, కన్ను - ఈ 3 నేత్రమునకుఁ బేళ్లు.

క. వీను లనఁ జెవు లనఁగా
జానుగు లన నాహ్వయములు శ్రవణంబులకుఁ
గౌ నన నడు మనఁగా నభి
ధానము లగు మధ్యమునకుఁ దరుణేందుధరా. 18

టీ. వీనులు, చెవులు, జానుగులు, ఈ 3 శ్రవణముల పేళ్లు. కౌను, నడుము - ఈ ౨ మధ్యమునకుఁ బేళ్లు.

తే. అక్కు ఱొమ్మెద బోర వానలరు వక్ష
మాస్యమున కొప్పుచుండు నాఖ్యలు మొగంబు
మోర మోమన్నఁ బేళ్లొప్పు నూరువునకుఁ
బెందొడ యనంగఁ గుఱువు నా సంవివాహ. 19

టీ. అక్కు, ఱొమ్ము. ఎద (ప్ర. హృదయము.) బోర - ఈ ౪ వక్షస్స్థలమునకుఁ బేళ్లు. మొగంబు (ప్ర. ముఖము,) మోర, మోము ఈ 3 ముఖము పేళ్లు. పెందొడ, కుఱువు - ఈ ౨ ఊరువునకుఁ బేళ్లు.

తే. వదనగుహ యొప్పు నోరు నా వాయి యనఁగఁ
బల్లు పలు నాఁగ దంతంబు పేళ్లు వెలయుఁ
బెదవి వాతెఱ మోవి యన్పేళ్లఁ దనరు
చుండు నోష్ఠంబు శీతాంశు ఖండమౌళి. 20

టీ. నోరు, వాయి - ఈ ౨ వదనగుహకుఁ బేళ్లు. పల్లు. పలు ఈ ౨ దంతమునకుఁ బేళ్లు. పెదవి, వాతెఱ, మోవి - ఈ 3 ఓష్ఠమునకుఁ బేళ్లు.

క. కరయి యనఁ గైనాఁ గే లనఁ
జెయి యనఁ జై నాఁగఁ జెయ్యి చే నా హస్తా.

హ్వాయము లగు నన్నపూర్ణా
ప్రియవల్లభ కాశికాపు రివరసిలయా. 21

టీ. కయి, కై, కేలు, (నిత్యైకవచనాంతము,) చెయి, చై, చెయ్యి, చే-ఈ ౭ హస్తమునకుఁ బేళ్లు.

క. ఎద యన డెందం బనఁగా
మది యనఁగా నెడఁ దనంగ మఱి యుల్లము నా
హృదయమునకు నివి యెనఁగును
విదితంబుగ నాహ్వాయములు విశ్వాధిపతీ! 22

టీ. ఎద, డెందము, మది (ప్ర. మతి,) ఎడఁద, ॥పా॥ (ప్ర. హృదయము,) ఉల్లము-ఈ ౫ హృదయము (మనస్సు) నకుఁ బేళ్లు.

క. లోఁజె య్యన నఱచె య్యనఁ
గాఁ జెల్లుం బేళ్లు రెండు కరతలమునకున్
మీఁజె య్యనఁ బెడచెయ్యను
నాఁ జనుఁ గరచరమభాగనామములు శివా. 23

టీ. లోఁజెయ్యి (లోను+చెయ్యి) = లోపలఁగా నుండెడు చెయ్యి. అఱచెయ్యి = లోపలి చెయ్యి, ఈ ౨ కరతలమునకుఁ బేళ్లు. మీఁజెయ్యి (మీఁదు + చెయ్యి) = మీఁదుగానుండెడు చెయ్యి, పెడచెయ్యి = పెడగా నుండెడుచెయ్యి - ఈ ౨ కరచరమభాగమునకుఁ బేళ్లు.

ఆ. పొట్ట డొక్క కడుపు బొజ్జ బొఱ్ఱ యనంగ
నొప్పుచుండు నాఖ్య లుదరమునకు
నాభిబిలమునకును నామధేయము లగు
బొడ్డు నాఁగ మఱియుఁ బొక్కి లనఁగ. 24

టీ. పొట్ట, డొక్క, కడుపు, బొజ్జ, బొఱ్ఱ-ఈ ౫ ఉదరము పేళ్లు బొడ్డు, పొక్కిలి, ఈ ౨ నాభిబిలమునకు, బేళ్లు.

తే. వెన్నసంగను వీఁపు నా । వెనుకమేను
నాఁగఁ జరమాంగమున కొప్పు । నామములుగఁ
బుఱ్ఱె తలపాల నాఁ బుఱ్ఱ । పుఱియ నాఁగ
ఫాలమున కాఖ్యలై యొప్పు । ఫాలనేత్ర. 25

టీ. వెన్ను, వీఁపు, వెనుక మేను-ఈ 3 పృష్ఠభాగము పేళ్లు. పుఱ్ఱె, తలపాల, పుఱ్ఱ ॥పా॥ పుఱుక, పుఱియ - ఈ ౪ కపాలమునకుఁ బేళ్లు.

క. అడు గంజ పాజ్జ యనఁగాఁ
బుడమిఁ బదంబునకు నామధేయము లిలసిల్లుఁ
మెడ కుత్తుక యల్లు గొంతు తన
నడరు గళంబునకుఁ బేళ్లు కంసధ్వంసీ. 26

టీ. అడుగు, అంజ, పాజ్జ - ఈ 3 పాదమునకుఁ బేళ్లు. మెడ, కుత్తుక, అల్లు, గొంతు - ఈ ౪ గళమునకుఁ బేళ్లు.

ఆ. బువ్వ వంటకంబు । బోనంబు మెతుకు కూ
డోగిరము పసాద । మోరె యనఁగ
నన్న మొప్పుఁ జేల । మలుకుఁ బుట్టంబు దు
వ్వలువ చీర కోక । వలువ యనఁగ. 27

టీ. బువ్వ, వంటకము, బోనము, మెతుకు, కూడు, ఓగిరము, పసాదము (ప్ర. ప్రసాదము), ఓరెము-ఈ ౮ అన్నమునకుఁ బేళ్లు. పుట్టము, దువ్వలువ, చీర, ॥పా॥ చీరె, కోక, వలువ - ఈ ౬ వస్త్రమునకుఁ బేళ్లు.

తే. మెసవె నారోగిణ మొనర్చె । మెక్కెఁ దినియెఁ
గుడిచె నారగించెను బసా । పడియె నమలె
సాపడె ననంగ నొప్పు భో । జనము సేసి
ననుట కివి యాఖ్యలౌ యీశ । యభ్రకేశ. 28

టీ. మెసవెను, ॥పా॥ మెసఁగెను, ఆరోగిణమొనర్చెను॥పా॥ ఆరోగణ

మెసవెచ్చెను, మెక్కెను, తినియెను, కుడిచెను. ఆరగించెను, పసాపడియెను, నమలెను, సాపడెను - ఈ ౧౧ భోజనము చేసె ననుటకుఁ బేళ్లు.

క. నాసి యనఁ సిగ్గు సిబ్బితి
నా నివి వ్రీడాపదంబు నామంబు లగుం
బానము సేయుట పేళ్లగు
నానుట త్రావు టనఁ ద్రాగు టనఁ గ్రోలు టనన్. 29

టీ. నాసి, సిగ్గు, సిబ్బితి - ఈ 3 లజ్జకుఁ బేళ్లు. ఆనుట, త్రావుట త్రాగుట, గ్రోలుట - ఈ ౪ పానము సేయుటకుఁ బేళ్లు.

ఆ. తలియ పళ్లెరంబు తెలె హరివాణంబు
తట్ట కంచ మనఁగఁ దనరుఁ బాత్ర
చెల్లుఁ బానమునకుఁ బేళ్లు డబ్బర కోర
గిన్నె యనఁగ రజత గిరి నివాస. 30

టీ. తలియ, పళ్లెరము, తెలె, హరివాణము, తట్ట, కంచము-ఈ ౬ భోజనపాత్రకు పేళ్లు. డబ్బర॥పా॥డబుర, కోర, గిన్నె - ఈ 3 పానపాత్ర.

తే. నతికిఁ బేళ్లొప్పు జోత దండము జోహారు
మ్రొక్కు జేజే యనంగఁ గేల్ మొగిచెఁ గేలిచె
నెఱఁగెఁ జేమోడ్చె నన నమస్కృతి యొనర్చె
ననుట కవి యాఖ్య లగు నీశ యభ్రకేశ. 31

టీ. జోత. దండము, జోహారు, మ్రొక్కు, జేజే-ఈ ౫ నమస్కారము పేళ్లు. కేల్మొగిచెను=చేతులు జోడించెను కేలిచెను, ఎఱఁగెను. ॥రూ॥ ఎరఁగెను. చేమోడ్చెను = చేతులు ముకుళించెను - ఈ ౪ నమస్కారము చేసె ననుటకుఁ బేళ్లు.

తే. ఒప్పు శయనించుటకును బవ్వళించెఁ బండెఁ
బవ్వడించెఁ బరుండెను బవ్వళించె

నత్తమిల్లె ననఁగ మఱి మెత్త సెజ్జ
పఱుపు పాన్పనఁ బగు శయ్య ఫాలనేత్ర. 32

టీ. పన్నుండెను, ॥పా॥ పండుండెను, పండెను, పవ్వడించెను, పరుండెను, పవ్వళించెను, అత్తమిల్లెను-ఈ 8 శయనించె ననుటకుఁ బేళ్లు. మెత్త సెజ్జ (ప్ర. శయ్య), పఱపు, పాన్పు - ఈ 4 శయ్య పేళ్లు.

తే. ఒప్పు ధ్వనిపేళ్లు రొద యన నులివు నాఁగ
సద్దనంగను గూఁత నాఁ జప్పు డనఁగ
నలుకు డన రోదనము సేసె ననుట కాఖ్య
లెసఁగు నఱచెను వాపోయె నేడ్చె ననఁగ. 33

టీ. రొద, ఉలివు, సద్దు, కూఁత, చప్పుడు, అలుకుడు-ఈ 6 ధ్వని పేళ్లు. అఱచెను, వాపోయెను, ఏడ్చెను-ఈ 3 రోదనము చేసెననుటకుఁ బేళ్లు.

క. అగు, బేళ్లు నీరువట్టన
దగ దప్పియు దూప యనఁగ దాహంబునకున్
నగవు నగు నవ్వు నవ్వు నా
నగు నాఖ్యలు హాసమునకు నగజాధీశా. 34

టీ. నీరువట్టు, దగ, దప్పి, దూప - ఈ 4 దాహమునకుఁ బేళ్లు. నగవు, నగు, నవ్వు, నవ్వు - ఈ 4 హాసము పేళ్లు.

క. చాగము నాఁ బుడుకనఁగా
నీగి యనఁగ నిడుట యనఁగ నీవి యనంగాఁ
దేగము నాఁ బెట్టుడు నాఁ
ద్యాగమునకు నాఖ్య లగుచు ధరఁ బరఁగు శివా. 35

టీ. చాగము పుడుకు, ఈగి. ఇడుట, ఈవి, తేగము, పెట్టుడు-ఈ 6 త్యాగము పేళ్లు.

ఆ. ఎలసె బెరసె హత్తెఁ గలసె సదికెఁ జెందెఁ
బొందె దొరసెఁ గూడె నొందె నెసఁసె

నసఁగ సక్తమయ్యె • ననుటకు నివి రేఫాఖ్య
లగు గిరీశ యీశ • యభ్రకేశ. 36

టీ. ఎలసెను, ఔరసెను, హత్తెను, కలసెను, అదికెను, చెందెను, పొందె
ను, దొరసెను, కూడెను, ఒంటెను. ఎనసెను, ఈ ౧౧ సక్తమయ్యెననుటకుఁ బేళ్లు.

ఆ. ఎడసెఁ బాసె వేఱుపడెఁ బురివిచ్చె నా
నలరు భేదమయ్యె • ననుట పేళ్లు
స్వవశమయ్యె ననుట • కవ్వఁ బేళ్లు లోనయ్యె
నగ్గమయ్యె ననఁగ • ననమనేత్ర. 37

టీ. ఎడసెను, పాసెను, వేఱుపడెను, పురివిచ్చెను-ఈ ౪ భేదమయ్యె ననుటకుఁ బేళ్లు. లోనయ్యెను, అగ్గమయ్యెను;-ఈ ౨ స్వాధీనమయ్యె ననుటకుఁ బేళ్లు.

ఆ. అగు గృహీతమయ్యె • ననుటకుఁ బేళ్లగ
పడియెఁ జేపడియెను • బట్టువడియెఁ
జిక్కువడియెఁ దగిలెఁ • జిక్కెఁ జిగుల్పడె
ననఁగ నగనివేశ • యభ్రకేశ. 38

టీ. అగపడియెను, (అగ్గముపడియెను) ఆధీనయ్యెను, చేపడియెను, పట్టుపడియెను, చిక్కువడియెను. తగిలెను, ॥పా॥ తవిలెను. చిక్కెను, చిగుల్పడెను - ఈ ౮ గృహీతమయ్యెననుటకుఁ బేళ్లు.

తే. అనియె నొడివె వక్కాణించె • నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికె నాఁ • జను వచించె
ననుట కాలించె నాలకించెను వినె నన
నలరు నవధరించె నటంచు • కాఖ్య లీశ. 39

టీ. అనియెను, నొడివెను, వక్కాణించెను, ఆడెను, చెప్పెను, వినిచెను, వాక్రుచ్చెను, పలికెను - ఈ ౮ వచించె ననుటకుఁ బేళ్లు. ఆలించెను, ఆలకించెను, వినెను - ఈ 3 అవధరించె ననుటకుఁ బేళ్లు.

క. కనియెం జూచెను గాంచెను
గనుఁగొనెఁ గన్గొనె ననంగఁ గలయవి పేళ్లై
చను వీక్షించె నటంచును
ఘనతరగోరాజగమన కాయజసమనా. 40

టీ. కనియెను, చూచెను, కాంచెను, కనుఁగొనెను, కన్గొనెను - ఈ ౫ ను వీక్షించె ననుటకుఁ బేళ్లు.

క. చనుఁ గృతఘ్నుఁడ నయ్యెన్
ననుటకు నామంబు లగుచు నని నరిగెడం
జనియెనుఁ బోయెను నేఁగెనుఁ
బనివినియెద ననెడునట్టి పలుకులు గుంద్రా ! 41

టీ. అరిగెను, చనియెను, పోయెనను, ఏఁగెను, పనివినియెను ఈ ౫ కృతఘ్నుఁడ నయ్యెనను టకుఁ బేళ్లు.

ఆ. ద్విగుణమున కభిఖ్య లగు నిబ్బడిమ్మడి
జంట దంట దుగయు జమిలి రెట్టి
యినుమడి యనఁ మిథున నామ కాఖ్య లగు జోడు
దోయి కవ యనంగ ధూర్తిలుప.. 42

టీ. ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెట్టి, ॥ పా ॥ రెంట, ఇనుమడి-ఈ ౮ ద్విగుణమునకుఁ బేళ్లు. జోడు, దోయి, కవ - ఈ ౩ ను మిథునమునకుఁ బేళ్లు.

సీ. ఒం డొక్కం డొకటి యొక్కండన నగు నేక
మీరు రెండిరు నాఁగ నెసఁగు ద్వయము
తిగ మూఁడు ముగ్గురన్నాఁగఁ దగుఁ ద్రయి తీవంచ
నలు నాల్గు చౌ యన నగుఁ జతుష్క

